5. ఎన్నికలలో పోటీచేసి ఓడిపోయినవారు డిపాజిట్టు పోగొట్టుకోని పక్షంలో ఆ డిపాజిట్టు పన్ను' కింద వసూలు చేయబడుతుంది."

ఇంతవరకు చదివి ఆ పెద్దమనిషి నాతో "ఈ ప్రజా పత్రికలు రాయటానికేం? నిజం ఆలోచిస్తే ఇది నిరుష్టమైన బడ్జెటు కానేకాదు" అన్నాడు.

"ఎందుచేతా?" అన్నాను.

"ఇది కాపిటలిస్టు మీద ఇన్డిరెక్టు టాక్సేషన్. ఉద్యోగాలు చేసుకునేవాళ్ళూ అడుక్కుతినేవాళ్లూ, కష్టేపన్ను పెట్టుబడిదార్ల మీదేకద పడేది. ఘోరం! ఘోరం!"

"అయితేనేం? పన్నుభారం జాస్తి అయినప్పుడు పారిశ్రామికులు తమకింద పనిచేసే వారంతా బిచ్చగాళ్లేనని చెప్పి తప్పించుకోవచ్చు. బిచ్చగాళ్ళ పన్ను చాలా తక్కువ కద," అన్నాను.

ఆయన విశాలంగా నవ్వి, "ఆ ఆలోచన నాకూ తట్టింది" అన్నాడు మళ్ళీ పత్రిక చదవసాగాడు.

"బడ్జెటు మీద మాట్లాడుతూ గ్రీటాగివరప్పగారు ఈ కింది విషయాలు చర్చించారు. ఈ ప్రభుత్వం యొక్క ఆశయం ఉత్పత్తి పెంచటం — పంచటంకాదు. సభ్యులు పరధ్యానంగా ఆలకించే దురభ్యాసం మానాలి. మన ఉత్పత్తి మన అవసరాలకు చాలంతలూ, మన ప్రజల కొనుగోలు శక్తికి నూరింతలూ అయే వరకూ మనకు ప్రపంచ దేశాల మధ్య తలవంపులే. మనదేశంలో నూటికి 90 మంది అయినా

అవసరాలకు మాడి చావకపోతే మనం నలుగురిలోనూ తల ఎట్లా ఎత్తుకు తిరుగుతామో నాకు తెలియటంలేదు. ఈ బడ్జెటును వీరారు ఆమోదించినట్టయితే అప్పుడు మన తడాఖా చూపిస్తాను. ఈ బడ్జెటు ఎందుకు ఈవిధంగా ఉన్నది. ఉన్న పాళంగా పాసు చెయ్యాలో మీకు సంగ్రహంగా మనవి చేస్తాను... దేశంలో ఇన్ని ఏళ్ళు గడిచినా ఇంకా మత వైషమ్యాలు తగ్గటం లేదు. మత సామరస్యం కోసం పాటుపడే వాళ్ళందర్ని జైళ్ళలో తోశాము. కాని కార్యం లేకుండా ఉంది. దేశంలో ఉన్న అల్ప సంఖ్యాక మతాల వారిలో కూడా. మత కలహాలకు బలి అయినవారు మిగతా వారిని పైదేశాలకు రవాణా చేశాము. దేశంలో ఏకమత ప్రతిష్టాపన చేశాము. అట్లాగూ మతసామరస్యం నెలకొల్పటానికి సాధ్యం కాకుండా ఉంది. మతవిముఖులూ, మతాన్ని తృణీకరించేవారూ ఇంకా దేశంలో ఉండి మతాభిమానులకు కోపం తెప్పిస్తున్నారని చెప్పటానికి నాకు చాలా తలవంపులుగా ఉన్నది. ఈ విషయమై తీవ్ర చర్య తీసుకోవలసి ఉంది. మతావేశం లేనివారందర్నీ పట్టుకోవటానికి ఒక ప్రత్యేక పోలీసుశాఖ వేస్తున్నాము దానికి 500 కోట్లు మాత్రమే ఖర్చు చేస్తున్నాం. నిజంగా ఈ మొత్తం చాలదు. కాని దీనితో నేపనిగడిచేటందుకు గాను మతోన్మాదం లేని వారినందరినీ ఉరి తీసెయ్యటానికి ఏర్పాట్లుచేస్తున్నాం. చట్టం అంత దారుణంగా పెట్టినట్టయితే పోలీసు శాఖకు కొంతపని తగ్గిపోవచ్చును... రష్యామీదా, తదితర ఫాసిస్టు దేశాలమీదా యుద్ధం చెయ్యటానికి సిద్ధంగా ఉన్న ప్రజా స్వామ్య

రాజ్యాలకు ఉచితంగా మరొక అయిదువందల కోట్లు—ఇది సముద్రంలో కాకిరెట్ట—ఇస్తున్నాం... మన ఉత్పత్తి సరుకు కొనని నిరాకరించే దేశాలమీద యుద్ధం చెయ్యటానికి పదివేల కోట్లు ఖర్చున్నది. దీన్ని గురించి సభ్యులలో రెండభిప్రాయాలు లేవని నమ్ముతున్నాను. మిగతా చిల్లర ఖర్చులుగాను నాలుగువేలకోట్లు అవుతుంది. ఈ నాలుగు కోట్లలోనూ మూడు కోట్లు, లాభాలు చాలక ఉత్పత్తి నిగ్రహిస్తున్న పారిశ్రామికులకు లంచంగా ఇవ్వవలసి ఉంది.

ఇంకా పత్రికలో బడ్జెటు చర్చకూడా ఉంది. కొందరు సభ్యులు, బడ్జెటు నిర్దుష్టంగా లేనప్పటికీ, లాభాలను దొంగ పోటు పొడుస్తున్నప్పటికీ, పారిశ్రామికులు దేశ క్షేమంకోసం కొంతత్యాగం చేసి ఈ బడ్జెటును సమర్థించాలన్నారు.

నా ప్రక్కనున్న పెద్దమనిషి ఇంకా చదువుకుపోతున్నాడు. నాకు విసుగెత్తింది. నాకసలే రాజకీయాలంటే మంట. కొందరికి ప్రపంచంలో ఏం జరిగినా అంతా కావాలి. నా కది పట్టదు. ఎవరిపని వాళ్ళు చూచుకుంటే చాలు. రాజ్యాలు ఏలేవాళ్ళు ఏలుతారు. మిగతావాళ్ళ కెందుకు నాడావుడి? నన్నడిగితే వార్తా పత్రికలే ఉండరాదు. వాటి మూలంగానే సమస్తాం ఆందోళన.

నాకూ పత్రిక చదివే పెద్దమనిషికీ మధ్యలో ఒక మాసపత్రిక కనపడింది. దాని పేజీలు తిరగవెయ్యసాగాను. "సంఘం దేనికి?" అనే ఒకవ్యాసం కనపడింది, అది రాసినవాడు జ్ఞన్నాతిరియ్య ఎం, బి, పి, డి, హెచ్, ఎక్స్. డీ, వై. త్రి, పీ, హం. (బాగ్) గారు.

ఆవ్యాసంలో మల్లాత్రయ్యగారు సంఘమనేది ఒక మూఢ విశ్వాసమని యుక్తియుక్తంగా వాదించాడు. ఏమిటీ సంఘం? దీనివల్ల మనకు కలిగిన లాభమేమిటి? ప్రకృతిలో అనేక జీవరాసు లున్నట్లే మనుషులూ ఉన్నారు. ప్రకృతి వ్యక్తులకే ప్రాధాన్యం ఇచ్చి, పరిణామమంతా వ్యక్తుల ద్వారానే జరిగింది. సంఘం వచ్చి వ్యక్తిని చంపేసింది మన జ్ఞానులు వ్యక్తికే ప్రాముఖ్యం ఇచ్చారు. ఎవడి మోక్షం వాడు చూసుకోవాలన్నారు. మనుషులు పుట్టింది లగా యతు అపూర్వవ్యక్తు లనిపించుకున్నవారంతా వ్యక్తులే— అంటే సంఘానికి ఎడంగా నిలబడ్డవారే. వాటిని సంఘం హతమార్చింది. ఒక అపూర్వ వ్యక్తికోసం అనామకులు నశించటమనేది ఉత్పత్తిక్రమంలోనే ఉంది. సంఘమను ప్రతి బంధకం లేనట్టయితే మానవజాతిలో ప్రతివాడూ ఒక అలె గ్జాండరు, ఒక నెపోలియను, ఒక హిట్లరు, ఒకనిచే అయి ఉండేవాళ్ళు. సంఘం మానవపరిశ్రమను అరికట్టింది ఒక నీతిచట్టమూ, న్యాయచట్టమూ, నిరబంధాలూ. డిప్రెష నలూ, మానసిక వ్యాధులూ, చెలరేగాయి సంఘసమ స్యలు పరిష్కారం అవుతున్నకొద్ది పెరిగాయి. న్యాయ స్థానాలనూ, నియమాలనూ ప్రకృతి అసహ్యించుకుంటుంది. ప్రతిక్రియకూ సృష్టిలో ప్రతిక్రియ ఉంటూనేఉంది. న్యాయ చట్టాలు ప్రకృతి కేవిధంగా సహకరించాయి? ఒకణ్ని మరొ కడు చంపితే చంపబడ్డవాడు చచ్చినవాడయినాడు. చంపినవాణ్ణి సమాజం ఉరితీయటంవల్ల అధికంగా అయిన దేమిటి? ఈ దిక్కుమాలిన సంఘంకోసం మతాలూ,

యంత్రాలూ, ఉత్పత్తీ, సమ్మెలూ, ఉద్యమాలూ, జైళ్లూ, కాల్పులూ, యుద్ధాలూ—ఇవన్నీ అవసరమయాయి. ఇంతా చేసి సంఘం విటని ఉపయోగిస్తున్నదా? లేదు. ఇవే సంఘాన్ని ఉపయోగిస్తున్నాయి. సంఘం అనేది పోవా లన్నాడు మ్నత్రెయ్య.

"కళల విషయంలో చూసినట్టయితే సంఘం కళలకు ఎంత అపకారం చేసిందీ స్పష్టంగా తెలిసిపోతుంది. కేవ లమూ సంఘసేవకోసమే ఉద్దేశించిన కళలు చాలా చచ్చుగా ఉంటూవచ్చినై. వ్యక్తిత్వం కూడుకున్న కళలే అత్యద్భుతంగా ఉన్నాయి ఈ విషయం అనేకశతాబ్దాలుగా విమర్శకులు గ్రహించినప్పటికీ దాని అంతరార్థం గ్రహించ లేకపోయినారు" అనికూడా రాశాను

నేనీ వ్యాసం చదవటం పూర్తిచేసేసమయానికల్లా ఆ పెద్దమనిషి పత్రిక మడిచి పక్కన పెట్టాడు.

"ఆ కినిపించేవేమిటి?" అన్నాను.

"అవా? అవి జైళ్ళు"

"అంత పెద్దవా?" అన్నాను.

"ఏం? అందులో ఇరవైవేలమంది ఉన్నారు"

"కొద్దిసేపటికింద ఇటువంటి ఇళ్లే చూశాను."

"అవును, ఈ ప్రాంతాల అయిదారు మైళ్ళకొక జైలున్నది.

"ఇవి జైలని నేను నమ్మలేకుండాఉన్నా. ఆ గోట్టాలూ అవి ఏమిటి?"

"అవి ఫ్యాక్టరీలు జైళ్లున్న చోట ఫ్యాక్టరీలుండవా?"

ఉంటాయని నాకు తెలీసు కాని ఆయన అన్నతరువాత నాకూ తెలిసినట్టే అనిపించింది.

"ఇప్పుడు పరిశ్రమయ్యావత్తు ఖైదీల శ్రమతోనే నడుస్తున్నది"

"అట్లా ఏం"

"ఒకచిక్కు వచ్చింది. మామూలుగా పెట్టుబడిదారీ వేదాంత ప్రకారం పనివాడు స్వేచ్ఛగా తనకూలి అమ్ముకుంటాడు. ఆస్వేచ్ఛను కూలివాళ్ళు దుర్వినియోగపరచి కూలికిరావడం మానేశారు. కూలికి రానివాళ్ళని నిర్బంధించటానికి చట్టం చెయ్యటం సాధ్యం కాకపోయింది. సమ్మెలుచేస్తే కాల్చవచ్చునని శాసనం చేసేసరికి వాళ్ళు అసలు పనికే రావటం మానేశారు. కాని మరోరకం శాసనం చెయ్యటం సాధ్యమయింది ఏమనిషిగానీ ఏవిధంగా బతుకుతున్నాడో చెప్పలేకపోతే వాణ్ణి జైల్లో వెయ్యవచ్చు ఈ విధంగా లక్షలకులక్షలు జైళ్ళలోపడ్డారు. వారంతా దమ్మిడీ కూలిలేకుండా పరిశ్రమలు నడుపుతున్నారు. తిండిమాత్రం పెట్టి రోజుకు 12, 14 గం॥లు పని చేయించటం సాధ్యమయింది. కాని కొంతమంది పెట్టుబడిదార్లు ఈ ఏర్పాటుకు గునుస్తున్నారు. వారి ఉద్దేశంలో స్వేచ్ఛగా వచ్చిన కూలీచే చౌకగా వస్తారుట. తిండికికూడా సరిగా ఇవ్వకుండా కూలీ వాళ్ళని సంపాదించిన పెట్టుబడిదార్లున్నారు మరి."

ఆయన మాట్లాడుతుంటే నాకు కోపంవచ్చింది.

"నువు నన్ను మోసం చేస్తున్నావు. పెట్టుబడిదార్లను గురించి అభూతకల్పనలు చేస్తున్నావు. నువు ఇందాక పత్రికలో చదినవన్నీ కూడా అబద్ధాలే. నేను పెట్టుబడిదార్ల నెరుగుదును. వాళ్ళు నా దేశాన్ని దాస్యంలోనుంచి బయటికి తెచ్చారు. వాళ్లు దేశభక్తులు.కమ్యూనిస్టు పీడనుకూడా వాళ్ళే తొలిగించారు. వాళ్ళనుగురించి నా మనస్సు విరచటానికి ప్రయత్నిస్తున్నావు. పెట్టుబడిదారీ విధానాలకే నువు ఎసరు పెడుతున్నావు. నీ నోరు మాట్లాడుతూంటే నొసలు వెక్కిరిస్తూ ఉంది. చూడు నిన్నేంచేయిస్తానో!," అన్నాను.

ఆయన నావంక అనుమానంగా చూశాడు.

"సధోరణిచూస్తే నువ్వు భూగర్భంలో నుంచి వచ్చిన కమ్యూనిస్టల్లే ఉన్నావు. నిన్ను నేను పసికట్టలేననుకున్నావా? చూడు—నిన్నేంచేయిస్తానో! పోలీసులు నా మిత్రులు, అన్నాడు."

"పోలీసులు నా మిత్రులు!" అన్నాను.

"నామిత్రులు!" అన్నాడు.

"పెట్టుబడిదార్లు మావాళ్లు!" అన్నాను.

"మావాళ్ళు!" అన్నాడు,

"పోరా కమ్యూనిస్టు" అన్నాను,

"పోరా కమ్యూనిస్టూ!" అన్నాడు,

"దేశద్రోహీ!" అన్నాను.

"పోరా ప్రజాద్రోహీ!" అన్నాడు.

"దొంగముండాకొడక దొరికావు! కమ్యూనిస్టువు కాకపోతే నీకు ప్రజలతో ఏంపని? చూడునీబతుకేం చేస్తానో!" అని ఆయనమీదికి వురికాను

ఆయన మాయమైనాడు. నేను కాస్తా రైల్లోనుంచి కిందికి పడటం మొదలుపెట్టాను.

*　　*　　*

ఉలిక్కిపడి పక్కలో లేచి కూర్చున్నాను.

ఏం కలఇది? దిక్కుమాలినకల!

కాని ఇది నిజంకాదు; నాకు తెలుసు. నాకల లేవీ నిజంకావు. నా మిత్రులంతా నాశ్రేయస్సుకోరి నన్ను కలలు కనవద్దనీ, ఎక్కడన్నా ఒక నౌకిరీ సంపాదించమని బుద్ధికలిగి బతకమనీ సలహా ఇస్తూనే ఉన్నారు. నాకే ఓపికలేకుండా వుంది.

# దినచర్య

విధీ విరామం ఎరగని బానిస, టెలిప్రింటరు టక టకా కొట్టుకుపోతున్నది. "సబ్బు" లందరూ తదేక ధ్యానంతో రాస్తున్నారు. వాళ్ళముందర తర్జుమా కావలసిన టెలిగ్రాముల బొత్తులున్నాయి.

కైలాసం విసుక్కుంటూ రాస్తున్నాడు. తనబల్ల మీదికి వచ్చిన టెలిగ్రాములన్నీ ఒకసారి చూసుకున్నాడు. ఒక్కటైనా "మంచి టెలిగ్రాం లేదు "మంచి" టెలిగ్రాం అనేదానికి ప్రత్యేకమైన నిర్వచనం లేదు. ఒక్కోరోజు కైలాసం యూరపుదేశాల చెల్లింపు సమస్యల్ని గురించి ఎంతో ఆసక్తితో రాస్తాడు. ఒక్కోనాడు చక్కని కథలాంటి టెలిగ్రాం వచ్చినా విసుక్కుంటాడు.

కైలాసం రాసే "మూడ్"లో ఉండేదీ లేనిదీ నిర్ణయించేవి ఏవో ఎవరూ చెప్పలేరు. అతనిమీద సంఖ్యా జ్యోతిషం పనిచేస్తుంది. అనగా తారీఖుల ప్రభావం జాస్తిగా ఉంటుంది. 20కి పైబడిన తేదీ సంఖ్యలు కైలాసం "మూడ్"కు అనుకూలంగా ఉండవు. ఇంటిదగ్గిర భార్య చేసిపెట్టిన వంటకాల ప్రభావమూ, ఆఫీసుకు వచ్చేటప్పుడు బస్సు

స్టాంపు దగ్గర ఎండలో నిలబడే పిఘుడీయుల సౌఖ్యాప్రభావమూ కైలాసంమీద బలంగా ఉంటాయి.

టెలిగ్రాములు తిరగేసేటప్పుడే కైలాసం ఒక్కొక్క దానిమీదా ఒక్కొక్క ప్రత్యేక విమర్శ విసిరాడు. ఇండొనేషియాలో అల్లరి. వాళ్ళకు స్వాతంత్ర్యం అరగటంలేదు. అంతేకావాలి (వెధవలకు)...మలయాలో జాతీయవాదుల మీద బాంబులవర్షం. నల్లులమీద డీ డీ టీ కొట్టినట్టే. అందులో విషం ఉండదట. నల్లులు హాయిగా డీ డీ టీ తినేసి మరిన్ని పిల్లల్ని పెడుతున్నాయి. కొంపనిండా నల్లులపుట్టలు. తెల్లాళ్ళూ నిద్ర పోనివ్వవు. ...డీన్ ఎచిసన్ చైనాను ఉద్ధరించాడు, ఆసియాను ఉద్ధరిస్తాట్ట! ఈ అమెరికా కమ్యూనిజంనుంచి ఆసియాను ఉద్ధరిస్తుం దనుకోవటంకన్న బుద్ధి తక్కువ మరొకటిలేదు. నిజంగా డీ డీ టీ తినేనల్లులకూ ఈ కమ్యూనిస్టులకూ ఏమీ తేడాలేదు...

కైలాసం రాయటం మానేసి తలఎత్తి చూశాడు. డెమొక్రసీని ఉద్ధరించే సత్యనారాయణా, కమ్యూనిజమును ఉద్ధరించే భగవాన్లూ చర్చ ప్రారంభించారు. అది రోజూ ఉండే చర్చే భగవాన్లు రష్యామీద ఈగవాలనివ్వడు. సత్యనారాయణ రష్యాపేరు చెబితే పంచాంగం విప్పుతాడు.

"అసలు రహస్యం ఒక్కడికీ తెలీదు. రష్యా అమెరికా కలిసి మిగిలిన దేశాల్ని యుద్ధంలో ముంచటానికి చూస్తున్నారు. అందుకే నెహ్రూ ఎటూ చేరలేదు" అనుకున్నాడు కైలాసం.

ఎవరూ గ్రహించలేని సత్యాలు తెలుసుకుని ఎవ్వ

రికీ చెప్పకుండా ఉండటంలో గొప్ప ఆనందముంది. ఆ ఆనందం కైలాసానికి రోజూ లభిస్తుంది.

"నువ్వుపోయి రష్యా వెళ్ళి చూసివచ్చావు గామాలు" అన్నాడు సత్యనారాయణ.

"చూస్తేనే తెలియక్కర్లేదు. బుద్ధి ఉంటే అన్నీ తెలుస్తయ్" అన్నాడు భగవాన్లు.

«అవును! నీ ఒక్కడికే పెట్టాడు మరి దేవుడు ప్రపంచంలో ఉన్న బుద్ధంతా" అన్నాడు సత్యనారాయణ.

«పోనివ్వండయ్యా," అన్నాడు శివరావు.

కైలాసం తిరిగి తలవంచుకు రాసుకోబోతుండగా టెలిగ్రాపు బంట్రోతు ఏదో టెలిగ్రాం తెచ్చి కైలాసం ముందు పెటాడు.

"అవతల ఆ బల్లదగిర ఇయ్యి" అన్నాడు కైలాసం. అమెరికా వెళ్ళి లియాఖతాలీఖాన్ పేలే అవాకులూ చవాకులూ రాయటం చాలక టెలిగ్రాములకు సంతకా లెవడు పెడుతూ కూచుంటాడు?"

«సుబ్రహ్మణ్యంగారూ, డినూండుకు తెలుగేమిటి?" అని అడిగాడు పార్వతీశం.

"ఖైదులో ఉంచటంకాదూ?" అన్నాడు సుబ్రహ్మణ్యం

ఎవరో నవ్వారు.

"డిమాండంటే ఖైదులో ఉంచట మేమిటయ్యా?"

"డిమాండు, అని రాయవయ్యా దేవుడా?" అని ఇంకొకరు అందుకున్నారు.

"ఓహో, డిమాండా? నేనింకా రిమాండేమో అనుకున్నా, నిన్న ఇట్లాగే చిత్రం జరిగింది. నేనేమన్నానంటే-"

"అబ్బాయ్, 'కోరికా' అని రాసిపారెయ్యి. అంతకన్న మంచిమాట ఏ డిక్షనరీలోనూ దొరకదు" అన్నారు మరొకరు

"రిక్వెస్టంటే కోరికగాని డిమాండంటే కోరికేమిటి? దబాయింపు, అని రాయనా?"

"ఏదో రాసుకుపోదల్చుకున్నవాడివి రాయక అందర్నీ చంపుతా వెందుకూ?"

మళ్ళీ సద్దుమణిగింది. కైలాసం లియాఖతాలీ "అభిభాషణ" దగ్గరికి తిరిగివచ్చాడు. ఇస్లామంటే డెమోక్రసీయేనంటున్నాడు లియాఖతాలీ.

"ఈ ఫ్రెంచిపేర్లు ఎట్లా రాయాలో మనకు తెలివదే. ఏమండి, దీక్షితులుగారూ, పి-ఐ-జి-ఎన్-ఓ-ఎన్ ఏమనాలి?"

"పానుయ్యో అనాలి."

"నే చచ్చినా అన్ను."

"పిగ్నాన్ అని రాయండి."

"ఆమాటన్నారు బాగుంది"

"ఈ దీక్షితులుగారొకడు పోగైనాడు మా ప్రాణానికి," అనుకున్నాడు కైలాసం, "సోయెకర్నో అనకూడదట! సుకర్నో అనాలిట! సుదర్శనో, సుమిత్రో అనాలిట! సోయెకర్నో అని రాస్తే అచ్చుపడదు కామాలు, అన్నీ వేసాలు!"

లియాఖతాలీ "అభిభాషణ అయేసరికే పుణ్యకాలం వెళ్లేట్టుంది. ఇంకా ఎచిసిన్ ఉద్ఘాటనా. మలయాలో కమ్యూనిస్టుల కిరాతక కృత్యాలూ, అదేదో రైలుప్రమాదమూ అట్లానే వున్నాయి.

"కైలాసంగారూ, లియాకతాలీని సమ్మరైజు చెయ్యటంలా? కొద్దిలో ముగించక పోయినారా?"

కైలాసానికి చాలా దుఃఖం వచ్చింది. కొద్దిలో ముగించాలని తెలిస్తే కైలాసం ఎప్పుడో పూర్తిచేసి ఉండును.

"టెలిప్రింటరు అరగంటనుంచీ కొట్టటంలేదు. ఏం జరిగిందో కాస్త కనుక్కుంటారా ఏమిటి?"

కైలాసం ఎగిరి గంతేసిలేచి టెలిఫోను దగ్గిరికి వెళ్లాడు.

"ఏమండీ? మెషీన్ ఆడటంలేదా? ఫైవ్ మినిట్స్ కిందకూడా క్రీడ్ చేస్తూ ఉన్నామే?...మా మెకానిక్‌తో కాపీలు పంపుతాం లెండి" అన్నది రిసీవర్.

"సెమీ అఫిషియల్ అంటే ఏం రాయాలి?"

"అర్ధ ప్రభుత్వ—"

"అర్థ ప్రభుత్వా? వ్యర్థ ప్రభుత్వా?"

"అయితే నాకు తెలీదు"

"నీకే కాదు, మహామహావాళ్ళకు తెలీదు."

"అది సరేగాని ఎక్స్‌చేంజాటే ఏమిటోయ్?"

"మారకం."

"ఎవరి మారకం?"

"మారకం కాదులేవయ్యా, వినిమయమని రాయి."

"వినిమయమంటే ఖర్చుచెయ్యటం కాదుటండీ?"

"అది వినియోగం."

"వినిమయమేమిటి? వినియోగమేమిటి? రెండూ ఒకటే"

"కాదులే, ఊరుకో."

"వినిమయమంటే మారకం వేసుకోవటమే లే. ఖర్చు చెయ్యటంకాదు."

"ఖర్చు చెయ్యటానికి వినిమయమని రాస్తున్నానే?"

"ఇక ఎప్పుడూ రాయబోక!"

టెలిఫోను మోగింది.

కైలాసం లియాఖతాలీని తప్పించుకోవటానికి లేచి టెలిఫోను దగ్గిరికివెళ్ళి రిసీవరెత్తాడు. రాయిటర్సు ఆఫీసు వాళ్ళు.

"మెషీన్ పనిచేస్తున్నదా?"

"లేదే."

"లైట్ ట్రబులేమో కనుక్కుంటాం. మెకానిక్ వచ్చాడా?"

"రాలేదు."

"కాపీలు తెచ్చాడా?"

"మెకానిక్ రాలేదు" అని అరిచాడు కైలాసం.

"అట్లా చెప్పరాదా? ఎందుకు కోపం చేసుకొంటారు?" అని మందలించింది రిసీవరు.

"కైలాసంగారూ, రైలు ప్రమాదంమీద స్టేట్మెంటు

వచ్చింది. మిగిలినవి మానేసి అది కాస్తరాయండి, ఇదిగో స్టేట్మెంటు"

మళ్ళీ సంభాషణ ఆరంభమయింది.

"ఈ విధంగా రైళ్ళు పడగొట్టే కమ్యూనిస్టులు ఉన్న కాస్త మర్యాదా పోగొట్టుకున్నారు"

"ఇది కమ్యూనిస్టులపనే! హారిపిళ్ళకడుపుడకా!... ఇంకా మీకేమన్నా సందేహమా ఏమిటి?"

"ఎంతమందిని పొట్టనపెట్టుకున్నారో."

"ఇదే విప్లవం!"

ఇటువంటి పనులుచేసినా కమ్యూనిస్టులను వెనకేసుకొచ్చేవాళ్ళున్నారు. అందుకనుకోవాలి."

"భగవాన్లూ! చూశావా ఎట్లా అంటున్నారో? చూస్తావేం?"

"నన్నేం చెయ్యమన్నావు?"

"కమ్యూనిస్టులు రైళ్ళు పడగొడుతున్నారుట."

"పడగొట్టని. విచారణ జరిపి శిక్షించేవాళ్ళులేరూ?"

"అట్లా జారిపోతావేం?"

"జారేందుకేముందీ? కొందరికి చూడకుండానే వార్తలు తెలుస్తాయి. దాని కెవరేంచేస్తారు?

"రైళ్లు పడగొట్టే వాళ్ళింకెవరూ లేరని మాకు ఆపాటి తెలుసులే. కాస్త మాకూ ఆమాత్రం ఊహించే శక్తిఉంది, దాం దుంపతెగ ఎంత ఇదయినా!" అన్నాడు సత్యనారాయణ.

"ఆ శక్తి ఎవరుమటుకువారు తమకుండటం అర్థం చేసుకోగలరుగాని ఇంకొకరికుండటం అర్థంచేసుకోలేరు. అక్కడే చిక్కొచ్చేది' అన్నాడు భగవాన్లు.

"అయితే కమ్యూనిస్టులు రైళ్ళు పడగొట్టటం లేదంటావు?"

"నేనేమీ అనలేదు. ఎవరు పడగొడుతున్నదీ ఎప్పటికైనా తెలియదా అంటాను."

ఆ వాదన అంతటితో ఆగిపోయింది.

కైలాసానికి క్షణక్షణానికి విసుగు జాస్తి అవుతున్నది. అతను అయిదు నిమిషాలలోపల రెండుసార్లు గడియారం కేసిచూసి, "ఈమధ్య అయిదు నిమిషాలేనా అయింది? లేక గడియారం ఆగిపోయిందా!" అని ఆశ్చర్యపడ్డాడు.

మెకానిక్ వచ్చాడు, కాపీలతో.

"ఎటువంటి సమయంలో మెషీను చెడిపోయిందో!.. కైలాసంగారూ, మిగిలినవన్నీ ఆపేసి నెహ్రూ సీకీస్ తీసుకోండి."

"నెహ్రూ ఉపన్యాసమా?"

"అవును. ఇవాళ అదే స్ట్రీమరు.

అంతవరకూ సగం చచ్చినట్టున్న కైలాసం ఒంట్లోకి ఎక్కడలేని శక్తీ వచ్చింది.

నెహ్రూ ఉపన్యాసం అయిదుభాగాలు చేతికొచ్చాయి. కైలాసం వాటిని ముందేసుకుని ఏకధాటిగా రాయటం మొదలుపెట్టాడు. చుట్టుపక్కల ఏంజరుగుతున్నదీ

కైలాసానికి తెలీదు. మెషీను ఎప్పుడు బాగయిందీ తెలీదు. నెహ్రూ సీరీస్ మరి మూడుభాగాల కాపీలు ఎప్పుడు ఎవరు తెచ్చారో తెలీదు. నెహ్రూ తొమ్మిదో భాగంనుంచీ మెషీనుమీద కాగితాలే వచ్చాయి. రెండు గంటలలోపుగా మూడు కాలముల తర్జుమా లాగి అవతల పారేశాడు కైలాసం.

* * *

«ఏమేవ్? పేపరు చూశావా? ఇవాళ స్ట్రీమరు హెడ్ లైను మనదే! ఎట్లా రాశాననుకున్నావు? శరపరంపరే నన్నుకో,” అన్నాడు కైలాసం మహోల్లాసంతో.

“ఏం స్ట్రీమరో? ఈపూట కూరేదొరకలేదు. పొద్దున కూడా పాపం, మీకు తిండి సరిగా అమరలేదు. ఈపూటేం తింటారో నా కర్మంకాలా!” అన్నది భార్య,

«ఏ కందిపచ్చడో చేసి, ఇంతచారు పెట్టవే. అంతకంటె ఏం కావాలి?» అన్నాడు కైలాసం, ఎంత అణచినా అణగని ఉత్సాహంతో.

# గండం

మరో గండం గడిచింది—పిండం బయటపడింది.

సుందరి పాలిపోయిన మొహంతో కళ్ళుమూసుకుని వెల్లకిలా పడుకుంది. ఇప్పుడామె మనస్సులో ఇందాక చెలరేగిన తుపాను జాడలేమీ లేవు. మొదటి కాన్పుకు పోని ప్రాణ భయం తన కీసారి ఎందుకు కలిగినట్టు? తన బిడ్డ మొగపిల్లవాడని తనకు ముందే తెలుసు—తనుపోతే ఏమవుతాడో అని ఎందుకంత ఖంగారు పడ్డది? తన చెల్లెలు, కమల వాణ్ణి సవతి బిడ్డణ్ణి చూసినట్టు చూస్తూంది!...

అన్నట్టు, పాపం, కమలగతి ఏమయిందని, కొంపతీసి దానికక్కడా ఇవాళే—

అవతల తన పెద్దన్నగారి భాగంలో కమల పురుడు పోసుకోవటానికి సిద్ధంగా ఉంది. తొలిచూలు. తను మలుచూలని తనకన్న కమలనే అందరూ బాగా చూశారు. తన్నడిగితే తొలిచూలుకన్న మలుచూలే కష్టం. మొదటి సారి జరగబోయ్యేది తెలీదు.

ఎట్లాగయినా కమలమీదనే అందరికీ ప్రేమ జాస్తి కావటానికి తనే అందగత్తె, తన మొగుడుకే ఎక్కువ ఆస్తి

ఉంది. కాని అందరికీ కనులమీదనే ఆపేక్ష. దాన్ని మొగుడు కూడా నెత్తిన పెట్టుకొని ఊరేగుతాడు. తనను అందరూ తక్కువగా చూసి, మళ్ళీ తను వికసరంగా ఉంటుందని తన మీదపడి ఏడుస్తారు.

తను నిజంగా మంచిదని ఎవరికీ తెలీదు—కమలకు తప్ప కమల ఒక్కతే తన్ను బాగా చూస్తుంది. తనకన్న మంచిది అదొక్కతే !

ఈ కుంక అయినా తన పోలిక అయితే బాగుండును. పెద్దవాడు అంతా అచ్చుగుద్దినట్టు తన మామగారి పోలికే.

ఈ పదిరోజులూ ఎట్లా వెళతయ్యో! తన్ను ముసలమ్మలు ఏంపీక్కుతింటారో, నూతిలో చాదవేసే దెప్పుళ్ళో!

సుందరి ఆలోచనలు అంతకంతకూ అస్పష్టం కాసాగినై ఆమెకు కాస్త మగతగా ఉంది.

* * *

"దానికన్నా కూడా మగపిల్లవాడే!... ఒక్కగంట తేడా కూడా లేదే! ఇదేంపాపఖర్మమో! ఇట్లా జరగ్గూడదరా! ఒక్క ఇంట్లోనే ఒక్కరోజునే రెండు కానుపులా? ఎవరో ఒకరికి గండం తప్పదు!"

ఈ మాటలన్నీ సుందరి చెవుల పడుతున్నై. కాని మనస్సులో నాటుకోవటం లేదు కొంత పరియత్నంమీద కళ్ళు తెరిసి చుట్టూ చూసింది.

అమ్మమ్మ చరచరా లోపలికొచ్చి సుందరికేసి చేతులూపుతూ, "ఆ కమలకూడా ఇప్పుడే కనుకూసింది. ఉపహారించండి" అని వెళ్ళిపోబోయింది.

"మగబిడ్డేనా?" అన్నది సుందరి బలహీనంగా.

"ఆ!" అన్నది ముసలమ్మ, ఆడబిడ్డ అయినా ఇబ్బంది లేకపోయేదన్నట్టు.

"ఎవరో ఓరి గ్గండంతప్పదు! ఎవరో ఓరి గ్గండం తప్పదు!"

అప్రయత్నంగా సుందరి తన బిడ్డణ్ణి పొదువుకున్నది. తన బిడ్డకే అపాయమూ రాదు! రాకూడదు!... పాపం, కమలకీ విషయంలోనూ తన అదృష్టం లేదు. దాని బిడ్డ ఏమవుతాడో! ఒకవేళ వాడికేమన్నా అయితే తనకు చాలా కష్టంగా ఉంటుంది—చాలా? —ఆఁ, అయినా ఆ ముసలమ్మ కబుర్లు నిజమూ ఏమిటి?"

ఇద్దరు బిడ్డలకూ ఆరురోజులు దాటిన తరువాత పెద్దవాళ్ళ విచారం వెనుకపడింది. గండం గురించి మాట్లాడటం మానేశారు. అప్పచెల్లెళ్ళిద్దరూ నూతిలో చేదవెయ్యటం మహావైభవంగా జరిగింది.

అందరూ తనపిల్లవాడికంటె కమలబిడ్డే కనుముక్కు తీరుగలవాడౌతాడనుకోవటం సుందరి విన్నది. కాని అట్టే అసూయపడలేదు. అసూయపడేటందుకవకాశం లేకపోయింది కమలబిడ్డే బాగున్నాడని ఎవరో అనగనే "ఎంత కనిబిడ్డ కాలేదు" అనేసామెత సుందరికి చప్పున స్ఫురించి మనస్సు చివుక్కుమన్నది. తన కటువంటి ఆలోచన రావటం చాలా తప్పు.

కాని కమలబిడ్డే అందంగా ఉంటాడనే విషయం సుందరి రూఢిచేసుకున్నది. అందులో ఆ మాట అంటే తనకు అందులో అబద్ధం ఏమీ కనిపించలేదు.

అప్రయత్నంగా సుందరి తన బిడ్డలో అనాకారితనం చూడటం ప్రారంభించింది.

"ఏడిముక్కు చట్టి ముక్కల్లే ఉందేమే, కమలా? వాడు నవ్వితే మూతి చూడు, పక్కకెట్లా పోతోందో !"

కమల దొంగకోపంతో, "బాగానేఉంది లేవే, పసి వెధవకట్లా వంకలు పెడతావేం? చిన్నపిల్లలంతా అట్లాగే ఉంటారు!" అన్నది.

కమల తనబిడ్డను ముద్దులాడినా, వెనకేసుకొచ్చినా సుందరి హృదయంలో ఏదో గుచ్చుతున్నట్లయేది. అది అసూయమాత్రం కాదు. కమల ఇద్దరుపిల్లల్లోనూ తేడా చూడనట్లు ప్రవర్తించేది. అది నటన ఎటా అవుతుంది? కమలవంటి అమాయకురాలు నటించగలదా! నటించటం తనకు చాతకాలేదు. కమల కొడుకుమీద తనకాపేక్ష లేదు. వాణ్ణిచూస్తే తనకు భయం —ఏమిటో అర్థంగాని భయం! వాణ్ణి చేతులోకి తీసుకుంటే జారవిడుస్తానని భయం! వాడికి తను నీళ్ళుపోసేటప్పుడు దెబ్బ గట్టిగానూ, తగలరానిచోట తగులుతుందని భయం!... నా దేక్షణాన గుటుక్కు మంటాడో ! (చిన్నపిల్లల కెంతకావాలి!) ఆక్షణాన వాడు తనచేతుల్లోమాత్రం ఉండకూడదు! వాడిప్రాణం దొడ్లో

పోతే తను ఇంట్లో ఉండాలి. ఇంట్లో పోతే దొడ్లో ఉండాలి ! ఇదే సుందరి కోరింది!

కమల చేతుల్లో తనబిడ్డ ప్రాణంపోతుందని సుందరి కేమాత్రము భయంలేదు.తన బిడ్డకు నీళ్ళుపోస్తూ ముంగాళ్ళ మీద బోర్లా పడుకోబెట్టుకుని చేతుల్లో వేన్నీళ్ళు పోసికొని వాడితలమీద కమల ఎంతగట్టిగా బాదినా తనకు భయం వేసేదికాదు. కమల తన బిడ్డ దగ్గిర ఉన్నంతకాలమూ వాడికి యమభయం లేదని సుందరికి గట్టిధైర్యం. అది సుందరిబిడ్డ మీద ఈగ వాలనీదు తన బిడ్డ ఏడిచినా నిర్లక్ష్యంగా ఉంటుంది గాని తన అక్క కొడుకు కాస్త కిచుమంటే అడావుడి పడుతుంది. వాడంటే దానికంత ప్రాణం !

*　　　*　　　*

ఇద్దరు బిడ్డలకూ ఆరో నెల జరుగుతున్నది. దీపావళికి అక్కచెల్లెళ్ళిద్దరూ పుట్టింటికి వచ్చారు.

తెల్లవారితే నరకచతుర్దశి అనగా సుందరి బిడ్డకు పెద్దపెట్టున జ్వరం వచ్చింది. దానివెంట దగ్గూ పడిశమూను. బిడ్డ నిమిషనిమిషానికి ఉక్కిరిబిక్కిరిఅవుతున్నాడు. సుందరికి గుండెల్లో రాయిపడింది. బిడ్డ బతకడని అధైర్యం పట్టుకుంది. మతిపోయింది.

కమలవచ్చి బిడ్డదగ్గిర కూర్చున్నది. వాళ్ళ చిన్నన్నగారు ఆ అపరాత్రివేళ వెళ్ళి వైద్యుడి దగ్గిర నాలుగు పంచదారమాత్రలు తెచ్చాడు. కమల తన చేతిమీదిగా వాటిని తన చనుబాలలో రంగరించి బిడ్డనోట్లో పోసింది. తరవాత

రెండుగంటలకల్లా బిడ్డ దగ్గటమూ, ఉక్కిరిబిక్కిరి కావటమూ తగ్గి నిద్రపోయినాడు. అంతసేపూ కమలబిడ్డ దగ్గిరే కూర్చుని వాడివూదుకు తనచెయ్యి ఆనించి వాడికేసిచూస్తూ కూర్చున్నది.

"కమల నాబిడ్డను బతికించమని దేముణ్ణి వేడుకుంటున్నది" అనుకున్నది, సుందరి ఎందుకో?

మర్నాడుదయమే తలంట్లు. కమల అన్నగార్లిద్దరికీ తలంటింది వాళ్ళ పిల్లలకూడా అంటబోతూ, "అక్కా పిల్లలిద్దరికీ కాస్త ఉగ్గు వెయ్యవే!" అన్నది.

కమలబిడ్డకు ఉగ్గువేసేటప్పుడు సుందరి చేతులువణికినై. కంగారుతో గిన్నెలోదంతా వాడినోట్లో పోసింది. పిల్లవాడు గుడ్లు తేలవేసి ఉక్కిరిబిక్కిరైనాడు.

"అయ్యో, అయ్యో! కమలా!" అన్నది సుందరి.

పక్కనే పిల్లలకు నలుగు పెడుతున్న కమల తిరిగైనా చూడకుండా, "ఏం, ఫర్వాలేదులే!" అన్నది. మళ్ళీ సుందరి హృదయములో ఏదో గుచ్చుకున్నట్టయింది.

* * *

నీళ్ళుపోసి సిల్కుచొక్కా—వాళ్ళనాన్న కొన్నది—తొడిగి ఉయ్యాల్లో పడుకోబెడితే కమలకొడుకు రాజా అల్లే, పండుకాయవల్లే ఉన్నాడు చిన్న మేనమామ చేతికామెరా తెచ్చి బిడ్డలిద్దరినీ ఫొటోతీస్తే అందులోకమలకొడుకే దేదీప్యమానంగా ఉన్నాడు.

సుందరి అసూయపడలేదు—

బతకనిబిడ్డ బారెడు !

"నేనెంత పాపిష్టిదాన్ని ! నాకేం పుండు పుట్టింది!" అని సుందరి తన్ను తానుతిట్టుకున్నది. కానీ ఆ దిక్కుమాలిన సామెత మరుపురాదు!

బహుళ విదియ ఆదివారంనాడు సాయంకాలం ఆరు గంటలవేళ కమలబిడ్డ వడగొట్టిపోయినాడు, ఆ గుంటూరు ఎండలు! ఆ కిందటిరోజే బిడ్డకు వడదెబ్బ తగిలింది. మర్నాడు ఎండ వేళప్పుడు బిడ్డకు శైత్యోపచారాలు చేశారు. బిడ్డ వాటితోనే పోయినాడు.

ఈ వార్త చెవినిపడగానే సుందరిహృదయం మీది నుంచి మూత తీసేసినట్టయింది. ఆమె హృదయంలోనించి పైకి పొంగివచ్చింది, ఆనందంకాదు దుఃఖం.

సుందరి కమల కొడుకుకోసం పెద్దపెట్టున ఏడువసాగింది. తనకొడుక్కు గండం తప్పిందన్న సంతోషం కలగలేదు. తనకొడుకేక్క గండం. ఆమాట తనకు మొదటినుంచీ తెలుసు.ఆసంగతి తెలిసి తను మనస్ఫూర్తిగా వాడి అచ్చటా ముచ్చటా చూడలేకపోయింది. వాణ్ణి ఒక్కసారయినా దగ్గిరికి తీసికోలేదు. ముద్దాడలేదు. అంతఅందమైన బిడ్డను చూసి అంతా మురిస్తే తను చావే చూడగలిగింది.

"నాకెంత అదృష్టం ఉంటేనేం? నేను పాపిష్టిదాన్ని.

ఇక నాకళ్ళతో నిన్ను చూడనుట్రా, తండ్రీ! నా బంగారు నాయనా!" అని సుందరి ఘోష పెట్టి, ఏడుస్తుంటే, ఆమె భర్త, "నీకేమన్నా మతిపోయిందా ఏమిటి? పిల్లలు పోరూ?" అని కోప్పడ్డాడు.

*　　　*　　　*

అయితే సుందరి ఒక్క పొరపాటుమాత్రం పడ్డది. తను పాపిష్టిదికాదు అదృష్టవంతురాలూ కాదు. తనకన్న కమలే అదృష్టవంతురాలు.



# అద్దెకొంప

మా శారదాంబ మొగుడు శివకామయ్య యోగ్యుడే కాని వాడి కుటుంబాలో వాడికి పోల్చదగిన మనిషి లేడు. శివకామయ్య తండ్రి వొట్టి దద్దమ్మ. పెళ్లాం ఎంత చెపితే అంతా. వాళ్ళవూళ్ళో పార్వతీశంగారిల్లంటే ఎవరూ చెప్పరు; కామాక్షమ్మగారిల్లంటే ఎవరికన్నా తెలుస్తుంది. అంతేకాదు; కానూరి కామాక్షమ్మ అని ఆవిడ నెవ్వరూ పిలవరు. కూనపల్లి కామాక్షమ్మ అనే పిలుస్తారు. ఆవిడ కూనపల్లివారి ఆడబడుచు. ఏడుగురు పిల్లలతల్లి అయినా ఈనాటికీ ఆవిడ కన్నవారింటనే ఉంటున్నది. ఎరగనివాళ్ళు పార్వతీశం ఇల్లరికపునికూడా అనుకోవటం కద్దు. కాని నిజం ఏమంటే కామాక్షమ్మ తండ్రిగారి కాపరం ఏనాడో చితికి పోయింది. జప్తుచేసిన తండ్రి ఆస్తిని కామాక్షమ్మ మొగుడి చేతనే కొనిపించింది. అందుకోసం పార్వతీశం అప్పు చెయ్య వలసి వచ్చింది. ఆ అప్పుతీరక, స్వగృహం అమ్ముకోవలసి కూడా వచ్చింది. మామగారి కొంప వ్యవహారరీత్యా తనదే అయినా, పార్వతీశంగారు దాన్ని మామగారి ఇల్లలే నే

చూశాడు. తనకన్న మామగారి వాళ్ళకే ఆ యింటిమీద అధికారం ఎక్కువ ఉన్నట్టుగా భావించాడు. అతని తరఫున బంధువులు ఎవరు వచ్చినా వాళ్ళకా యిల్లు పార్వతీశం మామగారిదే—కాకపోతే, కూనపల్లి కామాక్షమ్మగారిది - అనిపించేది గాని, పార్వతీశం గారి దనిపించేదికాదు. కామాక్షమ్మ తల్లి దండ్రులూ, అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్లూ కూడా ఆ యింటిని స్వగృహంలాగే చూసుకునేవాళ్ళు. అయిందా, కామాక్షమ్మ నోరు చెడ్డది. ఆమె హృదయం చాలా మంచిదని చెబుతారుగాని, దాన్నిగురించి సాక్ష్యం దొరికేదికాదు. ఎప్పుడన్నా తన కిష్టమైనవారికి ముగుడి సాతు పంచితే పంచేదేమో మన మెందుకు కాదనాలి? కాని మొత్తంమీద ఒకటి నిజం. పార్వతీశంలాంటి నోరూ వాయీ లేనివాడిలో వెయ్యి మంచిగుణాలున్నా గమనించేవాళ్ళుండరు. కామాక్షమ్మలాంటి గచ్చపొదలో ఏమాత్రం మంచి ఉన్నా వెంటనే ప్రచారం అవుతుంది. ఆవిడ కోడళ్ళను కోసుకు తినేది. ఆ మాటంటే "కోడళ్ళ కావిడ ఇచ్చే శిక్షణ తల్లులు కూతుళ్ళకు కూడా ఇవ్వరు!" అనే వాళ్ళు. నిజానికి కామాక్షమ్మ పెద్దకోడలు అమిత దురుసుపిల్ల. వాళ్ళ పుట్టింటివాళ్ళు, "ఇది కాపరం ఏం చేస్తుంది? ఏ మొగుడు దీనితో వేగుతాడు?" అనుకునేవాళ్ళు. అటువంటి రాక్షసి పిల్ల కామాక్షమ్మ ఇంట అడుగు పెట్టిన ఆరునెల్లలోపల పిల్లి అయిపోయింది.

అగ్నికి వాయువు తోడైనట్టు కామాక్షమ్మ గారికి

తోడుగా ఉండేది విధవ అప్పగారు. ఆ యిద్దరి మధ్య నలిగి పోతుండేవాళ్ళు ఇంటి కోడళ్లు. ఇంటి కొడుకులకు తల్లిని చూస్తే చెడ్డ భయం. పెళ్ళాలతో మాట్లాడాలన్నా వాళ్ళ తల్లి అనుమతి పొందవలసిందే. ఇంట్లో ఉన్న పదిమందీ ఒక్క మనిషి మాటమీద పోవటం వల్ల పైకి కాపురం చాలా గుంభనగా కనిపించేది. కాని లోపల ఏ ఒక్కరికీ సుఖం ఉండేది కాదని నా అనుమానం. కామాక్షమ్మగారి పెత్తనానికి ఎదురుతిరిగి వాళ్లు ఇద్దరు కనిపిస్తారు. అందులో మొదటిది మా శివకామయ్య చెల్లెలు, కృష్ణవేణి. అంటే మా శారదాంబ మూడో ఆడబడుచు. ఆవిడ మొగుడిదగ్గరికి వెళ్ళినాక తిరిగి పుట్టింటి గడప తొక్కలేదు. ఈ విధంగా ఇల్లు వదిలిపెట్టి పోయిన మరో కుర్రవాడు శివకామయ్య. తరువాతవాడు సుందరం.

ఇదంతా ఎందుకు చెప్పానంటే మా శారదాంబను అటువంటి ఇంటో ఇచ్చాం. కామాక్షమ్మగారు కోడళ్ళను కాల్చుకు తినటంలో మొరటు పద్ధతులు లేవు. కొట్టటమూ, తిట్టటమూ, వాతలు వెయ్యటమూ అన్నం పెట్టక మాడ్చి చంపటమూ మొదలైనవీ లేవు. అందుచేత ఆవిణ్ణి గురించి నలుగురూ అనుకోవటం కూడా జరగలేదు. మా శారదాంబ లాగా ఆత్మాభిమానంతో పెరిగిన పిల్లకి తిట్లకన్నా, దెబ్బల కన్నా ఒకమాట భరించటం చాలా కష్టం. తొందరపడి దానిమీద నేరం మోపితేనే సహించని మనిషిని... కామాక్షమ్మగారి కవాతుకు ఎట్లా లొంగుతుంది? శారదాంబ

ఎప్పుడూ నోరుచేసుకునే రకంకూడా కాదు. భరించలేని పరిస్థితి అని తోస్తే ఏదో అఘాయిత్యం చేసేస్తుంది.

అందుచేత శివకామయ్యకు పట్నంలో ఉద్యోగం దొరికిందంటే చాలా సంతోషించాను. ఎందుచేతనంటే, మొదటనే చెప్పినట్టు, అతను చాలా యోగ్యుడు. మా శారదాంబకుకూడా అతనంటే చాలా సదభిప్రాయమే ఉంది. కాని అతను ఇంటిదగ్గర ఉన్నంతకాలమూ మా శారదాంబకు సుఖం లేకపోయింది. ఈ ఉద్యోగం దొరకటం అతని ప్రాణానికీ, దాని ప్రాణాలకూ, మా ప్రాణాలకు కూడా ఎంతో సుఖమిచ్చింది.

అవి యుద్ధం రోజులు. శివకామయ్యకు దొరికిన ఉద్యోగంకూడా తత్సంబంధమైనదే. అయితే ఏమొచ్చిందంటే అతను మా శారదాంబను వెంటబెట్టుకొని పట్నంలో కాపరం పెట్టాడో లేదో, ఇంతలోనే మద్రాసుకు విమానదాడి భయం జాస్తి అయి, అక్కడినుంచి మన తెలుగు వాళ్లు సకుటుంబంగా స్వగ్రామాలకు పారిపోయి. రాసాగారు ఏమాటకామాటే చెప్పాలి. మన శివకామయ్య భయం లేదని చెబుతూనే ఉన్నాడు. అని మేం — అంటే మా వాళ్ళంతా — శారదాంబను గురించి, భయపడసాగాం. శివకామయ్య ఉద్యోగం వదిలి రాలేదు. శారదాంబకున్న పాటి ప్రాణభయం అతనికీ ఉంది. కాని మేం తన్ని గురించి అట్టే విచారించలేదు. మా పిల్లను గురించే భయపడ్డాం. శారదదాంబను పంపితేగాని వీలులేదని పట్టుపడితే , మామాట

తీసివెయ్యలేక అతను శారదాంబను మా యింటికి పంపే శాడు.

అయితే ఏమయిందంటే, శారదాంబ వచ్చిన కొద్ది కాలానికే ఆ విషయంకూడా రూఢి అయింది. ఆ సంగతి తెలియగానే దాని అత్తగారు దాన్ని తమయింటికి తీసుకు వెళ్ళి అయిదో నెలలో పంపిస్తామన్నారు సరే రెండు నెలలు అత్తవారింట గడిపి మా శారదాంబ పురిటికి తిరిగి మా యింటికి వచ్చేసింది. దానికి పురుడొచ్చి, పిల్లవాడుపుట్టి వాడికో మూడు నెలలు గడిచే సరికి అక్కడ పట్నంలో పరిస్థితులు మారిపోయినై. పట్నంనుంచి వెళ్ళిపోయిన వాళ్ళంతా తిరిగి రాసాగారు. పట్నంలో యిళ్ళన్నీ గబ గబా అయిపోతున్నాయి.

ఇంటివాళ్ళు బతిమాలగా, బతిమాలగా మా శివ కామయ్య తాత్కాలికంగా తన భాగంలోనుంచి రెండు గదులు ఇంటి వాళ్ళకిచ్చేసి తను సామానుతో సహా ఒక్క గదిలో చేరాడు. ఇంటివాళ్ళు శివకామయ్యను ఎంతో మర్యాదగా చూసేవాళ్ళు కారణమేమంటే ఆరు నెల్లపాటు ఇల్లంతటికీ శివకామయ్య ఒక్కడే వుండి ఇంటిని కాపాడాడు. నాలుగు మాసాల అద్దె అతని దగ్గర వాళ్ళు తీసుకోలేదు కూడాను. అటువంటి పరిస్థితిలో వాళ్లు రెండు గదులివ్వ మంటే శివకామయ్య కాదనలేకపోయాడు. అదికాక వాళ్ళు మాటకూడా యిచ్చారు. మా శారదాంబ రాగానే, నూరా రయినా, ఆరు నూరయినా ఆ రెండు గదులూ తిరిగి ఇప్పిం

చేస్తామన్నారు. సహం ఆ ధైర్యంతోటే శివకామయ్య గదులు ఖాళీచేశాడు.

పిల్లవాడికి మూడో నెల అనగా శారదాంబ అత్తవారు తీసుకువెళ్ళారు. మళ్ళీ పట్నంవెళ్ళితే ఎప్పటికో! వాళ్ళకు మాత్రం పిల్లవాడి ముద్దుముచ్చట్లుచూచుకోవాలనిఉండదూ? శారదాంబ అత్తవారింట రెండు నెలలుండి పట్నం వెళ్ళటానికి ఏర్పాటయింది. ఫలాని తేదికి తనకు రెండు గదులూ తిరిగి కావాలని ఇంటివారితో చెప్పాడు శివకామయ్య. దానికేం భాగ్యమన్నారు ఇంటివారు. శారదాంబ ఇంకో వారానికి బయలు దేరుతుందనగా శివకామయ్య మళ్ళీ ఇంటి వారిని హెచ్చరించాడు. ఆ గదిలో మరెవ్వరో ఉంటు న్నారు. వారు ఈ లోపుగానే మరో యిల్లు చూచుకుని వెళ్ళిపోతున్నారని ఇంటాయన శివకామయ్యకు తెలిసి పోయింది. బయలు దేరవద్దని శారదాంబకు తంతి ఇచ్చాడు. "నా దగ్గర మూడు గదులకూ అద్దె పుచ్చుకుంటూ ఇదేం పని?" అని ఇల్లుగలవాళ్ళని అడిగాడు. దానికి ఇంటివాళ్లు "ఈ రోజుల్లో పదిహేను రూపాయలకు మూడు గదులెట్లా వస్తాయి? నీ రెండు గదులకూ కలసి పాతికరూపాయలు చెవులు మెలేసి పుచ్చుకుంటున్నాము" అని సమాధానం చెప్పారు.

ఇంటివాళ్ల డబ్బు దాహమూ, దగాబుద్ధీ చూస్తే మా శివకామయ్యకు ఆశ్చర్యం వేసింది. యుద్ధం మూలంగా ప్రజల మన స్తత్వంలో కలిగిన మార్పు ప్రత్యక్షంగా

చూడటం అతనికిదే మొదటిసారి. కాని చేసేదేమీ కనిపించలేదు. ఇగో ఇంటికోసం వెతుకుదామంటే ఆదివారం తప్ప తీరదు. కాకపోయినా కాళ్ళకు బలపాలు కట్టుకుని తిరిగే వాళ్ళకే ఇళ్ళు దొరక్కుండా ఉన్నాయి. దొరికేవాళ్ళు దొరుకుతున్నయ్యనుకోండి. వందలకొద్దీ లంచాలు పెట్టాలి. లేదా ఇచ్చే బాడుగలో సగానికే రశీదు తీసుకోటానికి ఒప్పుకోవాలి. అదీకాకపోతే రెండు సంవత్సరాల అద్దె - అంటే ఇల్లు కట్టటానికి అయ్యే ఖర్చులో ఏ అయిదోవంతో ఆరోవంతుముందుగా దర్శించుకోవాలి.

ఈ పరిస్థితుల్లో మా శారదాంబ అత్తవారింటోనే ఉండిపోవలసివచ్చింది. అక్కడే వచ్చింది చిక్కు. మా శారదాంబ అత్తగారు తన పద్ధతులు మార్చుకోలేదు. ఆ పద్ధతులకు మా చెల్లెలు అలవాటుపడుతుందా అంటే, అదీకనిపించలేదు. దాని దగ్గర్నుంచి నాకు వారానికో ఉత్తరం రాసాగింది. ప్రతిఉత్తరంలోనూ చివరికి ఒకటే ముక్క. «నేనిక్కడ ఒక్క క్షణం ఉండలేను. ఎవరికీ చెప్పకుండా బయల్దేరి వచ్చేస్తాను. కాని అవతల పట్నంలో తన మొగుడికి కొంపలేదాయె మా ఇంటికి తీసుకుపోతే బాగుండదాయె. దాని అత్తగారింటో, అందరి అభిప్రాయమూ ఏమంటే ఇవ్వాళో, రేపో శివకామయ్య ఇల్లు సంపాదిస్తాడని, అటువంటప్పుడు మా శారదాంబను మేం తీసుకుపోతామంటే ఏం బాగుంటుంది ?

ఒకసారి ఏదో వంకపెట్టుకొని కామాక్షమ్మగారి యింటికి వెళ్ళాను పీలుచేసుకుని మా శారదాంబతో మాట్లాడి చూశాను. ఎవరెవరి మీదో పెట్టి తనను నానా మాటలూ అంటారంటుంది. ఇందులో మా శారదాంబ అనుకోవటం ఎంతో, నిజంఎంతో నాకయితే తెలీదుగాని, శారదాంబ బాధపడుతున్నదనటంలో అతిశయోక్తి ఏమీలేదు.

అందుచేత శివకామయ్యకు ఉత్తరం వ్రాస్తూ శారదాంబ పరిస్థితిగురించి అది రాసుకోలేని వివరాలన్నీరాశాను. తన వాళ్ళనుగురించి రాశానని అతను అనుకునేవాడు కాదులెండి.

నా ఉత్తరం అందిన కొద్దిరోజుల్లోనే శివకామయ్య ఒక అఘాయిత్యం చేశాడు. తన భాగంలో ఉండవలసిన గదులు ఇంటాయన అవసరానికి తీసుకుని తిరిగి ఇవ్వటం లేదని రెంటు కంట్రోలరుదగ్గర ఫిర్యాదుచేశాడు. రెంటు కంట్రోలరు ధర్మాత్ముడు. ఇంటాయన చెప్పిన అబద్ధాలన్నీ నమ్మక శివకామయ్యదే న్యాయమని గుర్తించాడు. అయితే ఇంటాయన ఇంకోపేచీ పెట్టాడు. సంవత్సరంన్నర క్రితం నాలుగు నెల్లపాటు శివకామయ్య అద్దెఇవ్వ లేదనీఅందుచేత అతన్నిఖాళీచేయించమనీ అర్జీ పెట్టుకున్నాడు. న్యాయానికి శివకామయ్యదగ్గర నాలుగు నెలల అద్దె రశీదులు లేవు. దానికి కారణం, ఇంటాయన అప్పట్లో అద్దె తీసుకోనన్నాడు. ఆనాడు కృతజ్ఞతాపూర్వకంగా చేసినపని ఈనాడు స్వార్థా

నికి అక్కరకు వచ్చింది. అయినా శివకామయ్యే గెలిచాడు. ఆ పాతశాకీ ఆరునెలలమీద తీర్చేటట్టుశివకామయ్యకు అవకాశంయిచ్చి రెంటు కంట్రోలర్ శివకామయ్యకు రెండు గదులూ ఇప్పించాడు. రెంటు కంట్రోలరు ధర్మమా అంటూ మా శారదాంబ పట్నం వచ్చేసింది.

* * *

నేను పట్నంవచ్చి వారంరోజులయింది. ఈ వారం రోజులనుంచి చాలా విచిత్రమైన కథ నడవటం చూస్తున్నాను.

ప్రతిరోజూ ముప్పూటలా ఇంటావిడ వాటింటోంచి నానా అవాచ్యాలూ మాట్లాడుతుంది. అవి శాపనార్థాలు కావు, అవి రంకెలుకావు! ఆవిడ అనే మాటల్లో కాస్త సౌమ్యమయినవి ఏమిటంటే, "వీళ్ళకి సిగ్గన్నా లేదేం? మా యింటోంచి పొమ్మంటే పోయిచావరేం? మా కొంప తప్పితే వీళ్ళకి నిలవనీడే లేదేమో! అయితే చెట్టుకింద పడుకో రాదూ? సిగ్గులా! ఛీ వీళ్ళ మొహాలు తగలెయ్యా. కోర్టుకు పోతారట. వీళ్ళ పిండాలు పిల్లులకెయ్యా!" ఈ ధోరణిలో.

మామూలు మధ్యతరగతి కుటుంబాల్లో గౌరవంగా బ్రతికే ఆడకూతురునోట ఇటువంటి మాటలు రావటం నా కాశ్చర్యం వేసింది.

"ఎవర్ని ఆ తిట్లు. తిట్టుతున్నది?" అని మా శారదాంబ నడిగాను!

శారదాంబ నవ్వి "ఇంకేవన్నీ? మమ్మల్నే! చావనీ గింజుకోనీ! మేం ఇల్లు ఖాళీచేస్తే ఈ భాగాన్నే నలభై రూపాయలకి ఎవరికన్నా ఇవ్వాలని వాళ్ళ ఆలోచన. డబ్బు దాహం నోటంట అట్లా పలుకుతున్నది. ఇదేం చూశావూ? దొడ్లో పొరపాటున చెంచా వదిలేసినా, ఎత్తుకుపోతారు. వాళ్ళకు పనికిరానిదైతే విరగగొడతారు. కొళాయిగొట్టం చిల్లిపొడిచి మా పక్క సందంతా నీళ్ళప్రవాహం చేశారు. అలగా కుర్రవాళ్ళకు కానీ అర్ధణా చేతిలోపెట్టి మా కిటికీ ముందునుంచి బండబూతులు అనిపిస్తారు!" అన్నది.

ఇదంతా ఎలా భరిస్తున్నావని మా శారదాంబను నే నడుగలేదు. ఎలా భరిస్తున్నదో, శారదాంబ ఎంతవరకు మారిందో నే అర్థంచేసుకోగలిగాను. మా శారదాంబ అత్తవారింటో అసలులో వున్నది క్షీణించిపోతున్న సంస్కృతికి చెందిన వికృత ఆచారం. కనుకనే శారదాంబ దాన్ని అతిక్రమించి అసహనం ప్రకటించగలిగింది. ఇక్కడ ఈ మద్రాసులో అద్దెయింటి సమస్య అటువంటిదికాదు. దీని మూలకందమేమిటో, ఎలా దీన్ని ఎదుర్కోవాలో మా శారదాంబకు తెలియదు, తెలియలేదు. అందుచేతనే దీన్ని సులభంగా భరించగలిగింది. ఏ ఇబ్బంది అయినా తప్పనిసరి కాదనీ, పరిష్కారమవుతుందని స్పష్టంగా తెలిసేవరకూ మనం తిరుగుబాటు చెయ్యలేము గదా!

# పానకంలో పీచు

దత్తాత్రేయులు అయిదోఏట, తనతల్లి పురుడు పోసుకోవటానికి మేనమామల ఇంటికి వచ్చినప్పుడు మొట్టమొదటిసారి బస్తీ మొగం చూశాడు. తనుకూడా ఆ ఇంటపుట్టినవాడే. మూడేళ్ళు నిండకపూర్వం ఇంకోసారి ఇక్కడికి తల్లి వెంట వచ్చాడు తాతకు కిందట్లూ మీదట్లూ అవుతున్న రోజుల్లో. అయితే ఆరాకగురించి దత్తాత్రేయులు కేమీ జ్ఞాపకం లేదు—తాత శవాన్ని స్నానం చేయించి ఫొటో తీయడం తప్ప ఆఫొటో కాపీ తన పల్లెటూరి ఇంటి సావడిలో రోజూ చూడకపోతే అతనికి ఆవిషయంకూడా జ్ఞాపకం ఉండేదేమో.

తమ్ముడి పుటకలకు బస్తీవచ్చినప్పుడుమాత్రం దత్తాత్రేయులు బస్తీ తరహాలన్నీ బాగా చూశాడు. మట్టిరోడ్ల గతుకుల్లోనూ. కాలుదిగబడే బురదలోనూ రోజూనడిచే దత్తాత్రేయులకు కంకరరోడ్లు అద్దాలల్లే కనిపించాయి. అతను మూడంతస్తుల మేడ ఎక్కాడు. రాత్రిపూట వీధుల్లో లాంతరు స్తంభాలు చూశాడు. పెద్దబజారులో దుకాణాలు చూశాడు.

వాటిల్లో ఆకర్షవంతంగా పెట్టిఉన్న రకరకాల వస్తువులు చూశాడు పెద్దబజారులో దుకాణాలు చూశాడు. రాత్రి వేళ ఈదుకాణాల లోనే వెలిగే "లస్టరు" దీపాలు చూశాడు. పెద్దచప్పుడు చేసుకుంటూ బజారులోపొయ్యే మోటారు కారుకూడా ఒకటి చూశాడు. మేనమామల ఇంటికి రైలు దారి అరమైలుదూరంలో ఉంది. కొత్తగా ఏర్పడిన బస్తీ స్నేహితుడివెంట రైలుకట్టనపోయి రైళ్ళు రావటమూ పోవటమూ కూడా చూశాడు. అదృష్టవశాత్తూ ఆరోజుల్లోనే తాగాశాయి జుట్టుతో ఇంతపెద్దబండ పైకెత్తటమూ, బండిమీద పదిమందిని ఎక్కించి బండిపోలు నుదుటికి ఆనించి బండిని తోయటమూ; కత్తులమీద పడుకోవటమూ, ఆడపిల్ల అందమైన గౌను తొడుక్కొని అంతకన్న అందమైన గొడుగు చేత్తోపట్టుకుని తీగమీద వెనక్కూ, ముందుకూ నడవటమూ చూశాడు.

ఇటువంటి జీవితాన్ని ప్రేమించటం ఎంతసులభం! తన బస్తీస్నేహితుడిముందు తాను తీసికట్టుగాఉన్నట్టు దత్తాత్రేయులు అనుక్షణమూ భావించేవాడు. తనకున్న ఉన్నత స్థాయిలో ఉన్నవాడి ఔన్నత్యం గుర్తించలేని అశక్తత సహజమైనదికాదు. అహంకారం కష్టపడి సాధించాలి. తన పల్లెటూళ్లో ఎందరో ఆడపిల్లలున్నారు. కాని ఈ బస్తీస్నేహితుడి చెల్లెలు—ఆ పిల్లకూ ఇతని ఈడే వుంటుంది—ఇతని కళ్ళకు అపూర్వంగా కనపడింది.

"నేను చచ్చినా పల్లెటూళ్లో ఉండను—పెద్దవాణ్నయితే!" అనుకున్నాడు దత్తాత్రేయులు.

తనపల్లెటూళ్ళో ఎవరూ చదువునిగురించి అంత ఆస క్తిగా మాట్లాడగా దత్తాత్రేయులు వినలేదు. కాని తనబస్తీ స్నేహితుడు చదువుగురించి చెప్పరానంత ఆసక్తిగా మాట్లాడేవాడు. ఆ అబ్బాయి తాను బియ్యే ఎన్నోఏట పేసవుతాడో. తరవాత ఎంత జీతంగల ఉద్యోగం చేస్తాడో వర్ణిస్తుంటే దత్తాత్రేయులకు నోరూరినంత పనయింది.

దత్తాత్రేయులు అటువాళ్లా, ఇటువాళ్లూకూడాధనికులని గానిదరిద్రులనిగాని చెప్పటానికి లేదు. వాళ్ళకి పెద్దకోరికలూ లేవు. పెద్ద రాబడిలేదు. అవసరాలూ, కోరికలూ తీర్చుకునే రాబడికలవాడేరాజాధిరాజు అందుచేత వారూ వీరూకూడా రాజాధిరాజులే. కాకపోతే దత్తాత్రేయులు తండ్రి పల్లెపట్టున ఉండి తనకున్న కొద్దిపాటి పొలాలూ, దొడ్లూ చూచుకునేవాడు. దత్తాత్రేయులు మేనమామలు ఉద్యోగాలు చేసుకొనేవాళ్ళు.

## 2

దత్తాత్రేయులకు తండ్రి చదువు చెప్పించరాదని ఎన్నడూ అనుకోలేదు. అయితే అయిదోఏటనే వాడు చదువుకోసం తాపత్రయ పడతాడని ఆయన అనుకోలేదు. చదువంటే ఆయన ఉద్దేశం డొక్కశుద్ధిఅని. రాయటమూ, చదవటమూ, లెక్కలు చేయటమూ చాతనయితే దత్తా

త్రేయులు జీవితానికి లోటుండదని ఆయన విశ్వాసం. ఆ చదువు ఎప్పుడారంభించినా మూడునాలుగేళ్ళలో పూర్తి అవుతుంది. అంతకన్న ఎక్కువ చదివితే కోరికలు బలుస్తాయని ఆయనకు భయం

"నేను బియ్యే ప్యాసవుతాను" అన్నాడు దత్తాత్రేయులు ధైర్యంచేసి

"నీ మొహమేం కాదూ? బియ్యే ప్యాసయి ఏం చేస్తావు? ఉద్యోగంచేసి, డబ్బుసంపాదించి, మీ మేనమామలల్లే అంగళ్ళకు పోస్తావా? వాళ్ల సంపాదనే ఈవూళ్ళో ఉంటేనా?" అన్నాడు తండ్రి.

"ఈవూళ్ళో ఉంటే సంపాదన ఎట్లా వస్తుందీ?" అన్నది దత్తాత్రేయులుతల్లి.

"అదీ నిజమే అనుకో. అందుకని మనవాడు ఉద్యోగాల కోసమని ఉన్నచోటు వొదులుకొని ఊళ్ళవెంట పోవాలంటావా? బాగుంది."

"మనం వద్దంటే తప్పుతుందా ఏమిటి? ఇంక నలుగురు పుట్టుకొచ్చి ఈ కాస్తా పంచుకుంటే ఏం తింటారు? వాళ్ళ పిల్లలకేం పెట్టుకుంటారు? ఆమాత్రం ఆలోచన లేదేం మీకు?"

పెళ్ళాం చెప్పేది ఆయనకు నిజంగానే కనపడినా కూడా నచ్చలేదు. తన అన్నగారు పల్లెటూరిపిల్లను చేసుకున్నాడేమో ఆవిడ ఇట్లా మాట్లాడదు. బస్తీదాన్ని చేసుకోవటం పెద్ద పొరపాటయిందనుకున్నాడు దత్తుతండ్రి.

"సరే అంతగా కొడుక్కు చదువు కావాలంటున్నావు కనక నీ అన్నల్ని దగ్గరఉంచుకు చదువు చెప్పించమను" అన్నాడు దత్తుతండ్రి, పెళ్ళాన్ని శిక్షిస్తున్నవాడల్లే.

"మావాళ్లు ఈమాత్రానికి వెరవరు లెండి" అన్నది దత్తుతల్లి.

చివరకు ఆ ఏర్పాటే జరిగింది. చదువుకోసం అంత చిన్నవయస్సులోనే మేనమామల ఊరు వచ్చేశాడు. కాని దత్తుకు బస్తీవచ్చిన ఆనందం కలుగలేదు. ఇక్కడికి వచ్చినప్పటినుంచీ, తల్లీ, తండ్రి, కాళ్ళూ చేతులు సాగదీసుకుంటూ ఆనుకునే పసితమ్ముడూ, ఇల్లూ, గొడ్లు, పొలాలు జ్ఞాపకం రాసాగాయి.

దీనికితోడు తన మేనమామల ఇంట్లో జీవితం మొదట కనిపించినంత ఆనందమయంగా లేదు. తల్లి పురుటి అడావుడిలో అందరూ ఒకటైనారు గాని వీళ్ళలో వీళ్ళకు కలతలున్నాయి. తన ఇద్దరు మేనమామల భార్యలూ అవకాశం దొరికినప్పుడల్లా కీచులాడుకుంటూ ఉంటాను. మళ్ళీ కలుస్తూ ఉంటారు. వీళ్ళమూలంగా మధ్య మధ్య వీళ్ళ మొగుళ్ళుకూడా తగూలాడుకోవలసి వస్తుంది.

ఈ పోట్లాటలో ఉండే స్వార్థం దత్తుకు అర్థమవుతూనే ఉండేది. కాని స్వార్థం మనుషులలో ఉండే చెడ్డతనంవల్లనే కలుగుతుందని ఆ వయసులో దత్తు నమ్మినాడు.

అతనింకా ఇతర విషయాలుకూడా మేనమామల ఇంట్లో గమనించాడు, తన పల్లెటూళ్ళో ఎరుగనివి-ఇక్కడ వీళ్ళు పొరుగింటివాళ్ళు చిన్న కరేపాకు రెబ్బలు అయినా ఇవ్వరు. అన్నీ డబ్బుపోసి కొంటారుగదూ, అందుకని ఎవరికీ ఏమీ పెట్టరు. ఇస్తే ఇచ్చినందుకు గంటసేపు సణుగుతారు. అడిగినవాళ్ళను గురించి అసహ్యంగా మాట్లాడుకుంటారు. ఆఖరికి ఇన్నిమజ్జిగ ఇవ్వటంకూడా వీళ్ళకు ప్రాణాంతకమే. ఇంటికి చుట్టాలు వచ్చిపోతే వాళ్ళనుగురించి, పరాయివాళ్ళనుగురించి మాట్లాడినట్టు మాట్లాడతారు. ఊళ్లో ఉన్న చుట్టాలనే నెలకొకసారికూడా చూడరు!

## 3

చాలా ఏళ్ళు గడిచాయి. దత్తాత్రేయులు హైస్కూలు చదువు పూర్తిచేశాడు. ఇప్పుడతనికి బస్తీజీవితం గురించి తెలియని విషయాలు లేవు. పల్లెటూరి జీవితం గురించే అతనికి ఏమీ తెలియదు. ఎప్పుడన్నా వాళ్ళఊరు పోతే విశ్రాంతికోసం వెళ్ళినట్టు భావించేవాడు. రెండురోజులు గడిచేటప్పటికి ప్రాణంవిసుగు వచ్చినట్టు ఉండేది. తమ్ముణ్ణి చూస్తే అతనికి ఆశ్చర్యమయేది. గొడ్లకాసుకునే వాళ్ళకీ, రంగడికీ తేడా లేదు. వాణ్ణికూడా చదివించాలని చూశారు గాని వాడికి చదువు అంటనేలేదు. వాడికి పొలాలమీద తిర

గటమూ, గోడ్లను మూడటమూ, అంగాజనంతో చేరి పోచి కోలు కబుర్లు చెప్పటమూ సగదా.

స్కూలుఫైనలు పరీక్షలో దత్తుకు వచ్చిన మార్కులు చూసి వాళ్ళ హెడ్మాస్టరు వాణ్ణి కాలేజీ చదువుకు పట్నం పొమ్మన్నాడు. ఒక్క కసబరుస్తున్న ఉత్సాహం చెడగొట్టటం ఇష్టంలేక, తనకు శక్తి లేకపోయినా, తండ్రి పట్నం చదువుకు సమ్మతించాడు.

"అంతగా అయితే అప్పుచేస్తాను. తరవాత వాడు పెద్ద ఉద్యోగం చేస్తే ఆభాగ్యం తిరిగి సంపాదించలేక పోతాడా ఏమిటి?' అనుకున్నాడు దత్తుతండ్రి.

దత్తుకు ప్రెసిడెన్సీ కాలేజీలో సీటు దొరికింది. మద్రాసులో అడుగుపెడుతూనే దత్తు "అసలు నేనుండవలసింది మద్రాసులో" అనుకున్నాడు. ఈ తారురోడ్లూ, ఈ ట్రాములూ, బస్సులూ, ఈ విద్యుద్దీపాలూ, ఈ మహా భవనాలూ, పార్కులూ, రేడియోలూ, దుకాణాలూ, సరికొత్త మోటార్లూ, అందులో పొయ్యే ఆడవాళ్ళూ, వాళ్లు కట్టే ఖరీదైన చీరెలు, పెట్టే రవ్వలూ, బీచీ, అక్కడ చేరే విద్యార్థులూ—ఇదే నిజమైన భూలోకస్వర్గమనుకున్నాడు దత్తు.

దత్తు సహాధ్యాయులలో మోటారు సైకిళ్ళకలవారూ కార్లమీద వచ్చేవాళ్లూకూడా ఉన్నారు. వాళ్ల జీవితమూ, ఇళ్ళూ, వాకిళ్ళూ, సంసారమూ, వాళ్ళ తండ్రులూ, తదితర బంధువులూ చేసే పెద్ద పెద్ద ఉద్యోగాలూ, వ్యాపారాలూ, చూసి అతను మురిసిపోయాడు. ఒక విద్యార్థి తండ్రి పేరు

మోసిన ఎడ్వకేటు, ఏడాదికో లక్షకళ్ళుజూస్తాడు. మరో విద్యార్థి తాత హైకోర్టు జడ్జిచేసి ఇటీవలనే రిటైరైనాడు. ఇంకో విద్యార్థి తండ్రికి పట్నంలో నాలుగైదు పెద్దభవంతు లున్నాయి. ఆయన వ్యాపారస్థుడు.

వ్యాపారం మాట ఎట్లా ఉన్నా గొప్ప ఉద్యోగాలు సంపాదించే అవకాశం తనకుకూడా ఉన్నందుకు దత్తు సంతోషించాడు. పట్నం జీవితం తనకు అందరానిదని అతనికి తోచలేదు

అయితే ఈవిషయం అతనికి కొంత అనుమానం కలగటానికి తోడ్పడ్డాడు గణపతి అనే కుర్రవాడు. గణపతి మళయాళీ కుర్రవాడు. అతనికి స్కూలుఫైనలు పరీక్షలో అంతులేని మార్కులు వచ్చాయట, గొప్పవక్త. డిబేటింగులో నిధి. ఇలోక్యూషను బహుమానాలు రెండుమూడు కొట్టేశాడు. చాలామంది కుర్రాళ్ళు గణపతి స్నేహం అభిలషించేవాళ్ళు. అతనికి గర్వం ఏమీ లేదు. అందరితోనూ మాట్లాడేవాడు. కాని అయిదు నిమిషాలు అతనితో మాటాడితే ఇవతలి వాడికే ఏదో సంకోచం కలిగేది. అంత తెలివిగలవాడితో సరిసమానంగా స్నేహం చేయటం ఎట్లా?

గణపతి ఎన్నివేల పుస్తకాలు చదివి ఉంటాడోనని దత్తు ఆశ్చర్యపడ్డాడు. కాలేజీ తెరచిన కొద్దిరోజులకే గణపతి రెండేళ్ల పొడుగూతా చదవవలసిన పుస్తకాలన్నీ ఒక విడత చదివి పారేశాడు, వాటిలో విషయాలను గురించి అతను మాట్లాడుతుంటే లెక్చరర్లు మాత్రం ఇంతకన్న ఏం చెప్పగలరనిపించేది దత్తుకు.

ఈ గణపతి ఒకగొడ్లసావిడిలాటి కొంపలో అతిబీదగా నివసిస్తున్నాడు. అతనిగది చూసి దత్తు నిర్ఘాంతపోయాడు.

నే నెవర్నని స ఉద్దేశం? మానాన్న పొలం దున్నుకుంటాడు. నూ అమ్మ పెడచేస్తుంది. మాకున్నదల్లా ఒక పూరిగుడిసె. నాకు ఆరుగురు అక్కచెల్లెళ్ళు; నలుగురు అన్నదమ్ములూ ఉన్నారు. నేను స్టేటుస్కాలర్షిప్పుతో చదువుకుంటున్నాను," అన్నాడు గణపతి.

"అయితే ఏం? నువ్వు పెద్ద ఉద్యోగంచేసి చాలా డబ్బు సంపాదిస్తావు. మంచి ఇల్లు కట్టుకొని దర్జాగా బతకవచ్చు," అన్నాడు దత్తు, తన కోరికలన్నీ తనకు సాధ్యమైతే గణపతి కెందుకు సాధ్యంకావనే ఉద్దేశంతో.

"మా సంస్థానంలోతప్ప నాకు ఉద్యోగాలిచ్చేవాళ్లెవరూ లేరు. నాసంపాదనకు నాతమ్ముళ్ళకూ చెల్లెళ్ళకూ చదువు చెప్పించ గలిగితే ప్రయోజకుణ్నే."

"తెలివిగల వాడివికదా, నీకు ఉద్యోగం ఎవరిస్తారంటావేం?"

"తెలివి తేటలకూ ఉద్యోగానికీ సంబంధమేమిటి? పలుకుబడిని బట్టి ఉద్యోగాలు దొరుకుతాయి."

"పోనీ ఏ లాయర్గో అయితే?"

"దానికయినా వెనక అభిమానించే వాళ్ళుంటేనే తెలివితేటలు రాణించేది."

గణపతికన్న కాలేజిలో వచ్చే విద్యార్థులే ఎక్కువను కోవటం దత్తుకు చాతకాలేదు. పెద్ద ఉద్యోగమూ, చాలా డబ్బూ సంపాదించే అవకాశాలు గణపతికే లేకపోతే తనకే మున్నాయనుకోవాలి?

"ఈ ప్రపంచం డబ్బూ పలుకుబడీ కలవాళ్ళది," అన్నాడు గణపతి. తాను ఎరిగిన తెలివిగలవాళ్ళు కొందరు చేస్తున్న ఉద్యోగాలను గురించి గణపతి చెప్పాడు. ఆ కథలు వింటే దత్తుకు నిస్పృహ వచ్చింది.

## 4

దత్తు బియ్యే పాసయినాడు, లా చదివాడు. లా చదువుకు, తండ్రి అభ్యంతరం చెప్పాడు. ఇప్పటికే దత్తు చదువు చాలా భారమయిందన్నాడు. సగం పొలం తాకట్టు పెట్టి డబ్బు తీసుకురావటమయింది.

మరి కొంతకాలం – రంగడివంతు మినహాయించగా మిగిలినదికూడా తాకట్టు పెట్టించి లా చదువు పూర్తి చేశాడు. బియ్యే చదువు పూర్తి కాగానే అతని వివాహమైనది. వాళ్ళు కట్నంకింద ఇచ్చిన సొమ్ముతో దత్తు భార్యకు నగలు చేయించారు. ఆ సొమ్ము మిగిల్చినా దత్తు చదువు తేలికఅయేది. మామగార్ని అప్పు అడుగుదామంటే వాళ్ళూ అంతంతమాత్రంగాళ్ళే.

దత్తు చదువు పూర్తికాగానే కాటకం వచ్చింది. అప్పులవాళ్ళు తాకట్టుపెట్టుకున్న ఆస్తంతా రాయించుకుని కూడా తను అసలు ఫాయిదాలు ముట్టలేదని వలవల్లాడారు. దత్తు తండ్రి కుటుంబమూ, అత్తవారి కుటుంబమూ, కూడా ఒక్కదెబ్బన చితికిపోయాయి. దత్తు పట్టా పుచ్చుకోవటానికి కూడా కాసి లభించలేదు. పట్టా పుచ్చుకొనిమాత్రం ప్రయోజనమేమిటి? కొత్తపేడర్లకు కాఫీ కర్చులు గిట్టటం గుమాస్తాల జీతాలు మొదలే గిట్టటంలేదు చాలామంది లా జర్నల్సుకూడా తెప్పించటంలేదు.

ఈ సమయంలోనే భార్య కాపరానికికూడా వచ్చింది.

తనూ తన భార్య రంగడి ఆస్తిమీదపడి తినటం తప్ప మరొకమార్గం లేకపోవటం దత్తుకు విస్మయం కలిగించింది.

"ఈ మారుమూల పల్లెటూళ్ళో కూచుంటే సంపాదన ఎట్లావస్తుందీ? పట్నం పోతాను" అన్నాడు దత్తు.

"రోజులు గొగుపడేదాకాలుగు. ఉన్నదే నలుగురమూ తిందాం" అన్నాడు రంగడు.

కాని దత్తుకు కాలు నిలువలేదు. పెళ్ళాం మెళ్ళోది తాకట్టుపెట్టి పట్నంచేరాడు. కాని ఇప్పుడు పట్నమంతా అపరిచితంగా ఉంది. ఈ మహాపట్నంలోనుంచి చదువెక్కడ దొరుకుతుందో దత్తుకు తెలుసు. కాని 30 రూపాయల నౌఖరీ ఎక్కడ దొరికేదీ తెలియలేదు. తన పాత కాలేజీలకు వెళ్ళాడు. అవి అతనికేసి గుర్తించినట్లు మాలేదు. రెండు

మూడు రోజులు తిరగగా ఎరిగినవాళ్లు కొందరు కనిపిం చారు. అతని స్థితిచూసి జాలిపడ్డారు. కాని తగిన ఉపాయం చెప్పలేకపోయినారు ఒకప్పుడు కార్లలో తిరిగేవాళ్ళనుచూసి అసూయపడ్డ దత్తు ఇప్పుడు ట్రాములలో తలపాగాలూ,కోటు ధరించి తిరిగేవాళ్ళను చూసి అసూయపడ్డాడు. ఆఖరుకు బాంకుల దగ్గిర డవాలీ బంట్రోతులుకూడా తనకన్న అదృష్టజాతకులల్లే, క్రిమజీవితం గడుపుతున్నవాళ్ళల్లే కని పించారు.

దత్తు కుంగిపోయిన మనస్సుతో ఇంటికి తిరిగి వచ్చాడు. అతనికోసం ఒక ఉత్తరం ఎదురుచూస్తున్నది. ఆ ఉత్తరం ఎవరురాసిందీకూడా కొంతసేపు దత్తుకు తెలియ లేదు. అది రాసినవాడు నాలుగేళ్ళక్రితం అతనితో కలిసి బియ్యే చదివిన ఒక అరవ కుర్రవాడు. దత్తు చిరునామా చాలామంది తీసుకున్నారు. కాని అరవవాడు ఇన్నేళ్లూ దాన్ని భద్రంగా దాచాడన్నమాట!”

“నువీపాటికి ప్లీడరీలో ప్రవేశించి ఉంటావను కుంటాను. నేను బొంబాయిలో ఒక ఎడ్వర్టయిజుమెంటు కంపెనీలో చేరి ప్రొడక్షను అసిస్టెంటుగా ఉన్నాను. నీ క్షేమసమాచారాలు రాయి ”

ఈ ఉత్తరానికి దత్తు వెంటనే సమాధానం రాస్తూ నేను బొంబాయివస్తే ఏమన్నా ఉద్యోగం దొరుకుతుందా? అని అడిగాడు.

దానికి అంవస్నేహితుడు "చాలా ఉద్యోగాలు ఖాళీ వస్తుంటాయి. నువువస్తే ఏదోఒకటి దొరక్కపోదు" అని రాశాడు.

దత్తు బొంబాయికి ప్రయాణమైనాడు.

బొంబాయి చూడగానే దత్తుకడుపులోనుంచి అనిర్వచనీయమైనఆవేదన, అతిఅందగత్తెనుచూస్తే కలిగినట్టుగా, బయలుదేరింది. ఇటీవల అతని హృదయంలో జీవితంమీద ప్రేమ దాదాపు పూర్తిగా ఇంకిపోయింది. దానికి కారణం, సగం తనకు అవాంతరాలు తగలటం, సగం తాను గౌరవించేవాళ్ళు చాలామంది సరిగా తిండిఅయినా లేకుండా అధోగతిలో ఉండటమునూ. అయితే బొంబాయిలో అడుగు పెట్టగానే జీవితంమీదఆశ మళ్ళీ దత్తు హృదయంలో చిగిర్చింది. ఈమహాపట్టణంలో కూలిచేసుకు బతికేవాళ్ళుకూడా మహా అదృష్టవంతులనిపించింది. ఈ బొంబాయిముందు మద్రాసు దివిటీముందు దీపం. ఈజీవితంలో నచ్చులేదు, ఎంతోవడివుంది. పిల్లనూ విమర్శించటానికీ, తోచక తిరగటానికీ, ఎవరికి తీరికలేదు.

దత్తుకు త్వరలోనే ఉద్యోగం దొరికింది. నెలకు 60 రూపాయలజీతం. అతని అరవస్నేహితుడు అతనికి బొంబాయి యావతూ చూపటమేకాక అరడజను ఖాళీలుచూపించాడు. దత్తుచేసేపనికి అతని చదువుకూ సంబంధంలేదు. ఇది గుమాస్తాగిరీ, అయితేనేం? 25 రూపాయలకూ మూడు

20)

గదుల భాగం, కొళాయీ, స్నానాలగదీ. ఎలెక్ట్రిక్ దీపాలూ వంటకుగానూ సహా దొరికింది. తనూ భార్యా హాయిగా ఉండవచ్చు. "ఈఇంట్లో ఉంటున్నాను," అని నాలుగంత స్థుల భవంతి తన వాళ్ళకి చూపిస్తే వాళ్ళెంత గర్విస్తారు?

అయిదారు నెలలు గడిచాయి. ఈ అయిదారు నెలలూ తనూ భార్యా స్వర్గంలోఉన్నట్టు భావించాడు దత్తు. తన మొదటి ఉద్యోగం వదిలేసి 80 రూపాయలకు ఇంకో వుద్యోగం సంపాదించాడు.

అయినా దత్తును అసంతృప్తి వేధించసాగింది. అతను జీతంలో కానీ మిగల్చటం లేదుసరిగదా, బొంబాయిలో నాగరికంగా బ్రతికి జీవించి ఆనందించాలంటే 80 ఒక జీతంకాదు. అన్ని విధాలా తనతో సమాను లనిపించుకునే వాళ్ళూ, తనకన్న తక్కువ వాళ్ళూకూడా నెలకు అనేక వందలు సంపాదిస్తున్నారు. ఈజీతంమీద రోజులు వెళ్ళుతున్నాయేగాని తనజీతం రెండు వేలకు భీమా చేసుకోవాలన్నా, నెలకో 10, 15 రూపాయలు వెనకవెయ్యదలచినా, భార్యకొక మంచి చీరెగాని కొనదలచినా ఇదోరాబడికాదు.

రంగడిపెళ్ళి అయింది. దత్తూ, భార్యా వెళ్ళలేక పోయినారు. డబ్బులేదు.

ఇంకో సంవత్సరం తిరిగివచ్చింది. దత్తుభార్య గర్భిణితోవుంది ఆమెను పుట్టింట దిగవిడవటానికి పోవాలంటే అప్పుచేయవలసి వచ్చింది. దత్తు అత్తవారింటినుంచి స్వగ్రామం వెళ్ళాడు. అక్కడి జీవితంచూస్తే దత్తుకు కడుపు

తరుక్కుపోయింది. తండ్రికి కుడికాలు స్వాధీనం తప్పింది తల్లికి విడిచి విడిచి చలిజ్వరం. చిక్కి శల్యమయింది. మందూ మాకూ లేదు. 60 ఏళ్లన్నా తిరక్కముందే వాళ్ళిద్దరూ మృత్యువునెదురుచూస్తూ వైరాగ్యంతో ఉన్నారు. రంగడిభార్య, పధ్నాలుగేళ్ళది కాపరానికివచ్చి, ఇంట్లో అందరికి తన భర్తకుకూడా, గర్భశత్రువల్లే ప్రవర్తిస్తున్నది అవిడిది సత్యాగ్రహం టిక్కెక్కు. జీవితంలోని రోస్టు మనుష్యుల మన స్తత్వాలలో చక్కగా ప్రతిబింబిస్తున్నది. మనుష్యుల మనస్సులు తుడిచిన అద్దాలల్లే మటుకు లేవు.

"నీ దగ్గర ఉంటే, పదో పుంటే ఇయ్యి, అన్నయ్యా" అన్నాడురంగడు.

దత్తు దగ్గిర లేదు అతను అప్పుతెచ్చినడబ్బు ఖర్చులకు చాలలేదు. బొంబాయిలో బయలుదేరే టప్పుడు ఆఖరు క్షణాన దత్తుభార్య తన చెల్లికొకచీరా. తన వదినెగారికొక చీరా కొనిపించింది. అయిదూ పది తక్కువైతే రంగణ్నడిగి తీసుకుందాంలెమ్మనుకున్నాడు దత్తు.

"నీదగ్గిర లేకపోతే పోనీలే. రూపాయి పుట్టించాలంటే ఎంతకష్టంగా ఉందనుకున్నావు ఏదో నాలుగురాళ్ళు తెచ్చుకుంటానికే అవస్థపడుతున్నావంటే మా సంగతి ఆలోచించు" అన్నాడు రంగడు.

దత్తు చాలా నొచ్చుకున్నాడు. తన జీతంలోనుంచి నెలకు అయిదు రూపాయలు పంపినా వీళ్ళు సుఖపడేవాళ్ళు.

తనకా ఆలోచన ఎందుకు తట్టలేదూ? 60 రూపాయలమీద తాను బతకలేదా?

ఈసారి దత్తు బొంబాయి వెళ్ళినప్పుడు తనఖర్చు పూర్తిగా తగ్గించాడు. సినిమాలు చూడటం పూర్తిగా మానేశాడు. విక్టోరియాస్టేషనునుంచి ఆఫీసుకు ట్రాముఎక్కకుండా నడవసాగాడు. ఇందువల్ల అతను అయిదారు రూపాయలుమాత్రమే ఆదా చెయ్యగలిగాడు. ఈ అయిదారు రూపాయలకోసం తన జీవితంలోని అల్ప సుఖాలన్నీ త్యాగంచేసినట్టనిపించింది దత్తుకు. కాని పళ్ళబిగువున దీక్ష సాగించాడు. కాకపోతే తన భార్యలేదుకనక ఇంకో పదిహేను ఇరవై ఆదా అయింది.

దత్తుభార్య ప్రసవించింది, ఆడపిల్ల. తల్లినీ పిల్లనూ తీసుకురావటానికి దత్తే పోదామనుకున్నాడు, ఈలోపుగానే తల్లికి చాలా జబ్బుగా వుందని రంగడు వుత్తరం రాశాడు. ఈ వుత్తరం అందిన రెండోనాడే ఆమె పోయినట్టు టెలిగ్రాం వచ్చింది.

దత్తు బయలుదేరాడు. అతను మామగారింట భార్యనూ పిల్లనూ చూసుకుని స్వగ్రామం వెళ్ళేసరికి తండ్రి కూడా ప్రమాదావస్థలో వున్నాడు. తండ్రికి కాస్త నయమయ్యేదాకా వుండి బయల్దేరుదామనుకున్నాడు దత్తు.

“నాకేం తొందరా నాయనా? నేనింకా ఎన్ని అవస్థలు పడాల్సివుందో, నువ్వు వెళ్ళు. నేను మళ్ళా లేచి తిరుగుతాలే” అన్నాడు తండ్రి.

దత్తు భార్యా బిడ్డలతోసహా బొంబాయి చేరుకున్న వారం రోజులకు తండ్రి మరణవార్త తెలిసింది.

దత్తుకు ఈసారి వచ్చినది దుఃఖంకాదు, ఆగ్రహం! ఎవరిమీదనో తెలియకుండా, పట్టరాని ఆగ్రహం! అతన్ని చూచి అతని భార్య ఆశ్చర్యంతో నిర్ఘాంతపోయింది.

“నన్నెందుకిట్లా పాపం వెంటాడుతున్నది? అయిన వాళ్ళదగ్గర కూర్చుంటే తిండిలేదు! తిండికోసం దేశాలు-కాని దేశాలు పోవటమూ, పెళ్ళయినా, పురుడయినా, పుణ్యాలైనా దూరాన చావటమూను! రంగడి పెళ్ళికిలేను! మా అమ్మ చావుకు లేను! నీ కానుపుకు లేను! మా నాన్న చావుకులేను. ఎందుకీ ఉద్యోగమూ, సంపాదననూ; తగలెయ్యనా? నేనిక్కడ పట్నవాసంలో సినిమాలు చూస్తూ కులుకుతుంటే అక్కడవాళ్ళు రూపాయికీ, అర్ధకూ ఉడ్డుకుడుచుకున్నారు. ఛీ, ఏం బతుకు?” అని దత్తు వాపోయాడు.

“బాగుందే? ఎవరిబతుకు వాళ్ళు బతకొద్దూ” అన్నది దత్తు భార్య.

“ఎవరి బతుకు వాళ్లు బతికినట్లయితే మా నాన్న ఆస్తికూడా నా కింద ఖర్చుకాదు. వెధవ చదువు! మా వాళ్ళు నాకోసం అడ్డమైనగడ్డీ తిన్నారు. వాళ్ళకు తెలీదు. పాపం. ఈ వేదాంతం,” అని దత్తు భార్యామీద పులిమాదిరిగా పడ్డాడు.

తండ్రి ఉత్తరక్రియలకు తను వెళ్ళటం అసంభవం. తన సెలజీతంలోనుంచి పది రూపాయలు మటుకు రంగడు పంపాడు

తండ్రిపోయిన మూడు వారాలకు చెప్పకుండా పెట్టకుండా రంగడుబొంబాయిలో ప్రత్యక్షమయినాడు. పొద్దున అయిదున్నరకు దిగినవాడు మాత్రంగా చేరటానికి తొమ్మిదిన్నరఅయింది. రంగడు వచ్చేసరికి దత్తు ఆఫీసుకు బయలుదేరేప్రయత్నంలో ఉన్నాడు. రంగడికి ఇంగ్లీషూ రాదు. హిందూస్థానీ రాదు.

"నేనా దిక్కుమాలిన ఊళ్లో ఉండలేను. మళ్ళీ ఒక ఎకరం అమ్మాను. బాకీలుతీర్చగా రెండువందలు మిగిలింది. మిగిలిన రెండెకరాలు తనపేర పెట్టమని నా పెళ్లాం పట్టుపట్టింది, మామగారు దానికి మద్దతు. అపుచేసి దాన్ని పుట్టింట దిగవిడిచి బయలుదేరాను, ఇక్కడ ఏదన్నా చెయ్యలేకపోతానా అని" అన్నాడు రంగడు.

రంగడు తాను తెచ్చిన డబ్బు దత్తువగ్గిరే ఉంచాడు. కావలసినప్పుడు రూపాయీ అర్ధా తీసుకుంటూ. రోజల్లా ఎక్కడెక్కడో తిరిగి రాత్రి దత్తుకన్న ఆలస్యంగా ఇల్లు చేరుకుండేవాడు.

ఒకరోజు రంగడు డీలా అయిపోయినవాడల్లె కనిపిస్తూ ఇల్లు చేరుకున్నాడు. రంగడి మొఖాన చిరునవ్వు తాండవిస్తున్నది.

దత్తు రంగడికేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

ఉద్యోగం సంపాదించాను. లాల్బాగ్ దగ్గిర ఒక

ఫాక్టరీలో కూలిపని దొరికింది. రోజుకు మూడుపావలా లిస్తారు. ఇక చింతలేదు." అన్నాడు రంగడు.

దత్తు నిర్ఘాంతపోయినాడు.

"ఆ సంపాదనతో ఎట్లా బతుకుతావు? కాపరం ఎట్లా చేస్తావు?" అన్నాడు దత్తు,

"కాపరమేమిటి? నా పెళ్ళాన్ని నేను పోషించను, దానికి పాల మిచ్చేశాను. దానిదారి దానిదీ, నాదారినాదీ? పని చాతయితే రూపాయో, రూపాయిన్నరో కూడా సంపాదించవచ్చు. ఇంకేం కావాలి?" అన్నాడు రంగడు నిశ్చింతగా.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA128B179 |
| పుస్తకం పేరు | పావకంలో పీచు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 165 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 4. |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |